# ప్రవంతి

## సాహిత్య మాస పత్రిక

వెల : రూ. 4-00

జూన్-1995



దక్షిణ భారత
హిందీ ప్రచార సభ-
ఆంధ్ర, హైదరాబాదు.

# సహాయక ప్రచారకులకు విజ్ఞప్తి

1. 1995 సెప్టెంబరు సెషన్‌కు పనిచేయు సహాయక్ ప్రచారకులు తప్పకుండా ప్రతినెల 5-వ తేది లోగా తమ మాసిక కార్య వివరణమును సభ కార్యాలయమునకు పంపవలెను.

2. 1995 ఆగస్టు నెలలో పరీక్షలు అయిన వెంటనే 21-8-95 లోగా విద్యార్థుల హాల్ టికెట్లు నెంబర్లు, విద్యార్థుల పేర్లు, ఉపస్థితి అనుపస్థితి (*Present Absent*) వేరే పేపరు పై వ్రాసి, సహాయక్ ప్రచారక్ నెంబరు, ప్రమాణిత్ ప్రచారక్ నెంబరు తప్పకుండా వేసి సభ కార్యాలయమునకు పంపవలెను.

3. విద్యార్థుల రోజువారి హాజరీ పుస్తకంలో 1-4-95 నుండి 31-8-95 వరకు హాజరీ వేసి సెప్టెంబరు 10-వ తేదీలోగా సభ కార్యాలయమునకు పంపవలెను.

4. సహాయక్ ప్రచారకులు ప్రార్థనా పత్రముల పైన, మాసిక [illegible] పైన తమ చిరునామా, పిన్‌కోడ్, జిల్లా స్పష్టంగా వ్రాస్తూ, సహాయక్ ప్రచారక్ మాసిక కార్య వివరణములోని అన్ని కాలములను తప్పనిసరిగా నింపి, సహాయక్ ప్రచారక్ నెంబరు, ప్రమాణిత్ ప్రచారక్ నెంబరు వేసి, స్పష్టంగా సంతకము చేయవలెను

5. 1996 మార్చి సెషన్‌కు ప్రార్థనాపత్రమును సెప్టెంబరు నెలఖరులోగా పంపవచ్చును.

సూచనః- సహాయక్ ప్రచారకులు అన్ని వివరములు హిందీలోనే వ్రాయవలెను. తెలుగు, ఇంగ్లీషు భాషలలో వ్రాసినచో పరిశీలించబడదు.

కార్యదర్శి

టెలిగ్రామ్ : హిందీసంఘ్ ఫోన్ ; 316865

495

# స్రవంతి

## సాహిత్య మాసపత్రిక

జూన్–1995

సంపాదకులు

శ్రీ వేమూరి ఆంజనేయ శర్మ

శ్రీ ఈమని దయానంద

శ్రీ అన్నదానం శంకరశాస్త్రి

దక్షిణ భారత హిందీ ప్రచార సభ–ఆంధ్ర,

ఖైరతాబాద్, హైదరాబాద్–500 004

సంవత్సర చందా 40–00

విడిప్రతి 4–00

Recommended for use in all the Public libraries and School Libraries by the Director of public Libraries, Andhra State, Madras, Vide proceedings sl No. 30/55 dated 6th January-1955.

---

# ఈ సంచికలో

సంపాదకీయం

# వినోబాజీ జయంతి ఉత్సవాలు

వినోబాజీ, గాంధీజీ ఇద్దరూ ఈ శతాబ్దంలో జన్మించిన మహా విభూతులు. భారత జాతిని ఆధ్యాత్మికంగా ఉత్తుంగ శిఖరాలకు చేర్చిన మహావ్యక్తులు. ఇది గాంధీజీ నూట ఇరవైఐదో జయంతి సంవత్సరం. ఇది వినోబాజీ శత జయంతి ఉత్సవ సంవత్సరం గూడాకావడం భారత జాతికీ, భారతీయులమైన మనకందరికీ ఎంతో సంతోషకరమైన విషయం. జాతిపిత గాంధీజీ రాజకీయ రంగంలో నైతిక విలువలను స్థాపించి అహింసాయుతమైన కొత్తమార్గంలో నిస్సహాయంగాపడివున్న మన జాతిని స్వాతంత్ర్య సమరాంగణంలో ముందుకు నడిపించివున్నారు. ఆయనకు సమకాలికుడై వారసుడుగా ఆధ్యాత్మిక విలువలను పుణికి పుచ్చుకొని, భూదాన యజ్ఞంవంటి మహత్తరమైన సాధనాలతో జాతి పురోగమనానికి తోడ్పడిన మహామనీషి వినోబాజీ. ఆయనకు గల పాండిత్యం అపారమైనది. కార్యశక్తి అమోఘమైనది. గాంధీజీకి సంపూర్ణంగా అంకితమైన జీవితం ఆయనది గాంధీ తత్వానికి భాష్యకారుడు వినోబాజీ. వివిధ భాషలను అభ్యసించి, వేదము, గీత, కురాన్, బైబిల్, ధర్మపదం వంటి మత గ్రంథాల సారాన్ని మథించి తనదైన శైలిలో జనసామాన్యానికి అంద జేసిన తత్వవేత్త వినోబాజీ. గీత నాకు తల్లిఅనీ, నా తల్లి మరణిస్తూ గీతామతల్లి వొడిలో నన్ను చేర్చి పోయిందనీ, ఆ తల్లివొడిలో మాతృప్రేమను నేను అనుభవిం చాననీ ఆయన తన రచనల్లో తెలియజేశారు. వేదాన్ని అధ్యయనంచేసి, ఉపనిషత్తుల సారాన్ని ప్రవచనాల ద్వారా, రచనల ద్వారా వారు ప్రజలకు అందించారు. మహర్షి, రాజర్షి, దేవర్షివంటి శబ్దాలకు గల అంతరార్థాన్ని వివరించారు. ఆధునిక యుగంలో మహర్షి అరవిందులనీ, రాజర్షి గాంధీజీ అనీ నిర్వచించారు వైదిక శబ్దాలకు గల అర్థాన్ని విస్తరింపజేసి, ఆధునిక వాతావరణానికి అనుగుణ్యమైన అర్థాలను కల్పించి శబ్ద ప్రపంచంలో అహింసాయుత విప్లవాన్ని తెచ్చినవారు వినోబాజీ. వారి శత జయంతి ఉత్సవాల సందర్భంలో వారి రచనలన్నింటినీ ఇరవై సంపుటాలలో అందంగా

ప్రచురించడానికి పవనార్ ఆశ్రమంలో పని ప్రారంభమైనది. ఇప్పటికి నాలుగు సంపుటాలు ఐహా సుందరంగా ప్రచురింపబడినవి. మొదటి రెండు సంపుటాలూ వేదానికి సంబంధించినవి వేదచింతన్, వేదసుధ ఆ సంపుటాల పేర్లు. మూడు నాలుగు సంపుటాలు భగవద్గీతకు సంబంధించినవి. గీతకు చాలా మంది భాష్యాలు వ్రాశారు. ముగ్గురు ఆచార్య పురుషులూ శంకర, రామానుజ, మధ్వాచార్యులు తమ తమ సిద్ధాంతాలకు అనుగుణ్యంగా భాష్యరచన చేసి వున్నారు. తిలక్ మహాశయుడు కర్మయోగానికి ప్రాధాన్యమిస్తూ ఉద్గ్రంథాన్ని రచించారు. గాంధిగారు అనాసక్తి యోగమన్నారు. వినోబాజీ సామ్యయోగ మన్నారు. గాంధీజీ వినోబాజీల భాష్యాలలో విద్వాంసునికంటే సాధకుడు ఎక్కువగా కనిపిస్తాడు. అది వాటి విశేషత. గాంధీజీ వినోబాజీలు సాధన ద్వారా గీతను అర్థం జేసుకొని మనకు బోధపరచిన వారు మొత్తం ఇరవై సంపుటాలలో వినోబాజీ రచనలన్నీ ప్రచురణ కాగలవు. దక్షిణ భారత హిందీ ప్రచార సభ వినోబాజీ జయంతి సందర్భంగా ఒక పెద్ద కార్యక్రమాన్ని చేపట్టవలెనని నిశ్చయించింది. వినోబాజీ రచనలు గల ఇరవై సంపుటాలనూ దక్షిణ దేశభాషలలోనికి తెలుగు, తమిళం, కన్నడం, మళయాళ భాషలలోనికి అనువదింపజేసి అందంగా ప్రచురించవలెనని సంకల్పించింది. గీతా ప్రవచనం తెలుగులో ఇదివరకే దాదాపు 83 వేల ప్రతులు అమ్ముడయినవి. అయితే వినోబాజీ రచనలన్నీ తెలుగులోనికి రాలేదు. సభ సంకల్పించిన కార్యక్రమం విజయవంతం కావలెనని స్రవంతి ఆశిస్తున్నది. ఆ మహా మహుని రచనలన్నీ తెలుగులో ప్రచురణ కావలెనని కాంక్షిస్తున్నది.

# సాహిత్యవీధి

## రావిశా చిత్రించిన సృష్టి స్వభావం

మార్క యాదయ్య

'మానవాకారాల్లో అడుగున జంతువులు దాగొని ఉంటాయని' రాచకొండ విశ్వనాథ శాస్త్రి 'ది స్మోకింగ్ టైగర్' అను పులిపూజ కథలో అన్నాడు. ఆ పశుపక్ష్యాదులు మానవీకరింపబడి, పాత్రలుగా చేయబడే సంప్రదాయ కథా నిర్మాణ పద్ధతిని తన రచనలకు బలమైన ఆకర్షణగా మలచుకొన్న విశిష్ట రచయిత రావిశాస్త్రి.

రాచకొండ తన కథల్లో చీమలను, పాములను, గోవులను, గొర్రెలను, పులులను, మేకలను, కప్పలను, తూనిగలను, కొంగలను, కోడిపెట్టలను, నక్కలను పాత్రలుగా చేసి మానవ సమాజంలోని అల్ప ప్రాణుల దగ్గర నుంచి రకరకాల స్వభావాలతో ప్రవర్తించే మానవులనూ, మానవ జీవితాలనూ స్ఫురింప చేయగలిగాడు. అటువంటి వాటిలో రావిశాస్త్రి 'సృష్టిలో' అనే కథ ముందుగా మనల దరిసి ఆకర్షిస్తుంది. 'సృష్టి భోగట్టా శాస్త్రజ్ఞులు చెప్పాలి, కథకులు కరెక్టుగా చెప్పగాలరు' అంటూనే రావిశాస్త్రి ఆ సృష్టి స్వభావాన్ని అలవోకగా అంచనా వేసి చూపించాడు.

'సృష్టిలో' అనే కథలో చిల్లర దొంగగా జీవిస్తున్న వీరన్న పక్క ఊరి వీరనాయుడి ఇంటినుండి మూడు కోడి పెట్టలను ఎత్తుకొస్తాడు. ఆరోజే వాటిని పట్నంలో అమ్ముకొందామని అనుకొంటుండగా పోలీసులకు ఏదో 'ఇన్ఫర్మేషన్' కావల్సి వచ్చి వీరన్నను స్టేషన్‌కు తీసుకువెళ్ళి మూడు రోజుల తర్వాత విడిచి పెడతారు. ఇంటికి వచ్చిన వీరన్నకు ఒక్క కోడి పెట్టే కనిపిస్తుంది. మిగతా రెండింటిని నక్క ఎత్తుకు పోయిన విషయం అతని భార్య చెప్పినా నమ్మక ఆమె మీది అనుమానంతో ఆమెనుబాగా కొడతాడు. కానీ పిల్లలిద్దరూ కోడి పెట్టలను గత రాత్రి నక్క ఎత్తుకుపోయిన విషయం నిజమేనంటారు ఆ రాత్రి వీరన్న కాపలాకాసి మిగిలిన కోడిపెట్ట కోసం వచ్చిన నక్కను బాగా కర్రతో కొట్టి చంపుతాడు అక్కడ అడవిలో వున్న నక్క పిల్లలు తమ తల్లికోసం బొరియ నుండి బయటకు రాగా వాటిని కొండచిలువ మింగేస్తుంది. తెల్లారిన తర్వాత పోలీసు జవానుతో వచ్చిన. వీరనాయుడు తప్పిపోయిన తన కోడిని గుర్తుపడతాడు. వీరన్న

సర్వోదయ విద్యాలయం, మామున్నూరు హసన్‌పర్తి

తాను తెచ్చినవాటిలో రెండు కోళ్ళను నక్క ఎత్తుకు పోయిన సంగతి నవ్వుతూ చెప్పి పోలీసుల వెంట స్టేషన్‌కు వెళ్ళాడు. తన యజమాని వద్దకు చేరిన కోడిపెట్ట లోకంలోని పాపం గురించి ఛీత్కరించు కోవటంతో 'కథ' ముగుస్తుంది. అటు తర్వాత చెప్పిన కథను రావిశాస్త్రి బ్రాకెట్ల మధ్య సూచించాడు. అందులో వీరనాయుడి కోడిపెట్టలను వీరన్న ఎత్తుకుపోయాడని, నూకల నాయుడి పదిసెంట్ల భూమిని వీరనాయుడు కాజేసాడని, అందుగురించి నూకల నాయుడు దావా వేయగా ప్లీడరు గుమాస్తా అతని డబ్బంతా ఎగేశాడనీ, ఇలా వార్ని మరొకరు మరొకర్ని ఇంకొకరు, ఇంకొకర్ని వేరొకరు పరంపరంగా దోచుకుతినే ప్రపంచ రీతిని రచయిత వివరించాడు.

## 1

ఈ కథ కోడిపెట్ట నిద్రరాక గూడుకింద భయం భయంగా కునుకు తీయటంతో మొదలవుతుంది. కోడిపెట్టల ఇష్టాయిష్టాల ప్రకారం లోకం నడవదు' అని రచయిత తీర్మానిస్తూ బాధం 'భయాల వాళ్ళకి సరిగా నిద్రలుండవు' అంటాడు. భద్రత వుండే కోడిపెట్టకూడా ప్రశాంత జీవితం గడపగలదని రావిశాస్త్రి చమత్కరించినట్లుగా ఇక్కడ భావించవచ్చు. తనతోపాటు వచ్చిన రెండు కోడిపెట్టలు కూడా నక్కవాత పడటంవల్ల మిగిలిన ఆ కోడిపెట్ట కూడా ఈ జీవితం నిండా ఉన్న హింసా ప్రవృత్తిని సమీక్షించుకొంటుంది. 'తను ఎందుకు పుట్టింది? ఏ పెంట పురుగుల్ని భక్షించి ఈ విధంగా ఎదిగి, దొరికిన కీటకాల్ని హింసించి చంపి, పెరిగి పరుల హింసకు భయపడి ఒదిగి ఎందుకు తను జీవిస్తోంది? తను చేసే నిత్యహింసని తనెప్పుడయినా, ఎన్నిటికయినా త్యజించ గలదా? హింసకు బలి కాబోతామేమోననే అనుక్షణ భయంనుంచి తనకి ఎన్నటికయినా, ఎప్పటికయినా విముక్తి అంటూ ఉంటుందా?' అని కోడి ప్రశ్నించుకోవటంతో, తనహింసాత్మక స్వభావాన్ని అతిక్రమించాలన్న అవగాహనకల్గి ఉన్నదన్న భావాన్ని రచయిత సమర్థవంతంగా కల్గించాడు.

కోడిపెట్ట పెంటపురుగులను, కీటకాలను తినటం ఆకోళ్ళను నక్కలు తినటం, ప్రకృతిసహజధర్మమే అయినా ఆధర్మంలో ఉన్న హింసను కోడి వ్యతిరేకించింది. ఇక్కడ రచయిత అందుకే కోడిని వర్ణిస్తూ 'వేదం వినలేదు, ఖురాన్ చదువలేదు, బైబిల్ చూడలేదు. అది ఎమ్మే చదవలేదు. అయినా అప్పుడది గుడిలో నిరాకారుడయిన దేవుని ముందు రెక్కలొచ్చిన కొళ్ళన్ మార్క్సులాగా ధిక్కరించి కూర్చున్నట్లు కూస్తుంది' అని తెలిపాడు. ఏ మత ప్రవక్తలు, భిక్షువులు, పీఠాధిపతులు దర్శించలేనంతగా ఈ కోడి పెట్ట తన జీవిత కోణం నుంచి ఆలోచిస్తూ హింసా ప్రవృత్తిని వ్యతిరేకించటాన్ని మనం ఇక్కడ గమనించవచ్చు.

అక్కడ అడవిలో నక్క ఆహారం కోసం బయలుదేరుతున్నప్పుడు దాని మూడు పిల్లలు తల్లి వైపు బితుకు, బితుకు మని చూస్తాయి. అప్పుడా నక్క 'అయ్యో! పిచ్చి పిల్లల్లారా? బెంగ పెట్టుకోకండర్రా! అలా వెళ్ళి ఇప్పుడే వస్తాను... మీకేం తెలీదు. కష్టపడక పోతే కూడు దొరకదమ్మా! నేను కష్టపడితే నాకు బతుకు! మీకు బతుకు, మీరు పెద్ద వాళ్ళయి మీ కాళ్ళకి పరుగులొచ్చి, వాళ్ళకి పదునొస్తే మీరు లోకం మీదపడి బతకొచ్చు. కాని అందాకా నా కోసం మీ కోసం

కూడాను నేను తిరక్క తప్పదు. అలానెళ్ళి రానీ యండమ్మా' అని అంటుంది. నక్కకైనా మరే ప్రాణికైనా కష్టపడక పోతే ఈ ప్రకృతిలో కూడు దొరకదు అయితే ఆ కష్టపడే మార్గాన్ని ఎంచుకోవటంలోనే వారి వారి ప్రవృత్తులు దాగి వున్నాయి. కొందరు శ్రమ పడుతూ జీవిస్తూవుంటే, మరికొందరు అక్రమను దోచుకుతింటూ పబ్బం గడపుతున్నారు. ఇక్కడ తెలివి, కపాయి తనం, టక్కరి తనం, మూల స్వభావంగా కల్గిన నక్క. వీరన్న ఎత్తుకొచ్చిన కోడి పెట్టలను మాయం చేయటానికి పూనుకొన్నది ఆ పని రెండు రోజులు సజావుగా సాగినా మూడవ రోజు వీరన్న చేతిలో మరణం తప్పలేదు అంటే ఏనాటికైనా మోసానికి, హింసకు ఆఖరి ఘడియలు రాకతప్పదని పాఠకులకు రచయిత అవగాహన కల్గించాడు.

నక్క జీవితాన్ని స్మృతిగా వర్ణిస్తూ 'ఎండలో నల్లగొండ నీడ, వెన్నెల్లో పైరు పచ్చగాలి, పొలాల్లో చెరుకుతోట తీపి; అంతకు ముందు తల్లి పాల తీపి, మొదటి సారిగా రుచి చూసిన మొదటి కోడి ఉప్పటి నెత్తురు, తియ్యటి మాంసం, మేకల్ని వేటాడిన రోజులు, మొదటి సారి మనిషి రాక్షసుడ్ని చూడగానే తనకు కలిగిన జుగుప్స, తమ జాతి వారే అయినప్పటికి మనుష్యుల తమ్ముడు పోయిన కుక్కలతో పోట్లాటలు, ఆకలి కోసం తను చేసిన హింసాకృత్యాలు,, అనునిత్యం భయాలు, ఎల్లప్పుడు రక్తపాతాలు, అయ్యో! ఏమిటి?! ఎందుకిది? ఎక్కడకిసి?'' అన్న నక్క ఆలోచనలను చూపటం. వల్ల అది తనలోని హింసాత్మక లక్షణాన్ని అసహ్యించుకోవటం వల్ల నేనని పాఠకులకు అవగతమవుతుంది.

ఇక్కడ హింసకు గురికాబోతున్నాననే భయంతో కోడిపెట్ట చేసిన ఆలోచనలు, హింసకు గురియై మరణం పాలైన నక్కలోని ఆఖరి స్మృతులు: రెండూ కూడా హింసా వ్యతిరేక భావాన్ని కల్గి వున్నాయి. తమ జీవితాల నిండా పరుచుకొని వున్నది హింసా ప్రవృత్తియే అయినా హింసకు బలయ్యే ఆఖరి క్షణాలలోనైనా అవి హింసను వ్యతిరేకించక, అసహ్యించుకోక తప్పలేదు. హింసకు లోనయినప్పుడు హింస చేస్తూ జీవించే జీవితంలోని నైచ్యాన్ని జంతువులైనా గుర్తించ గలిగాయి. మెదడుండి ఆలోచించగల మనుషులు గుర్తించగలుగుతున్నారా? అనే ప్రశ్నను రావిశాస్త్రి కోడిపెట్ట, నక్కపాత్రల ద్వారా మనకు వేశాడు హింసా ప్రవృత్తినుండి బయటపడి పరులను హింసించే ప్రవృత్తిని ధిక్కరించాలన్న చైతన్యం ఈ రెండు పాత్రల ద్వారా రచయిత పాఠకులకు కలిగించడంలో కృతకృత్యుడైనాడు.

సామాజిక పాత్రలలో భాగంగా వీరన్నను కథలో ప్రవేశపెట్టినాడు, 'వీరన్న చేతిలో ఉన్న బాణాకర్ర వీరన్నది కాదు. వెకటి దగ్గర్నుంచి అది అతను ఎరువు తెచ్చాడు. కమ్మలపాకలో పడుకున్న ఆడమనిషి ఏడాది క్రితం అతనిది కాదు. ఆపిట్ట అతను లేపుకొచ్చి ఏడాదే అయ్యింది. పాకలో పడుకున్న ఇద్దరి పిల్లల్లోను ఓ ఆడపిల్ల అతని కూతురు కాదు. ఆమెని ఆ లేచి వచ్చిన తల్లి తీసుకొచ్చింది, మగకుర్రవాడు మాత్రం వీరన్న కొడుకే. కాని ఆపిల్లడు తల్లిని వీరన్న ఏడాదిక్రితం తన్ని తగిలేశాడు' అని పరిచయంచేస్తాడు రచయిత ఇతరుల ఆస్తులను స్త్రీలను ఎత్తుకు రావటం తాను పీడనకు గురవుతూ కూడా తన కంటే లోకువైన భార్యను తన్ని తగలెయ్యటం అనే అంశాలు

వీరన్న జీవితంలో వున్నాయి. దోపిడీ, పీడనలకు గురయ్యే అట్టడుగు వర్గాల వాళ్ళు కూడా పీడించగలిగిన అధమ స్థాయిలో స్త్రీలున్న స్థితిని రావిశాస్త్రి ఇక్కడ సూచించాడు. కోళ్ళను నక్క ఎత్తుకు పోయిందని భార్య చెప్తే నమ్మక ఆమెను బావగొట్టాడు. వీరన్న దృష్టిలో పురుషుడు పీడకుడి స్థానంలో స్త్రీ పీడిత స్థానంలో ఉండటాన్ని కూడా రచయిత ఈ విధంగా సూచించగలిగాడు.

చిల్లర దొంగగా వున్న వీరన్న పోలీసుల ఇన్ఫార్మర్‌గా వ్యవహరించటం, రోజుల తరబడి వారితో తిరగటం, పోలీసు జవాన్లకు నవ్వుతూ జవాబులు చెప్పటం, మొదలైన అంశాలు, బ్రతుకు తెరువుకై వెదకులాగే వాళ్ళను దొంగలుగా తిరుగుబోతులుగా సమాజం మార్చే క్రమంలో ప్రభుత్వ, పోలీసు వ్యవస్థల పాత్ర కూడా వుందని రావిశాస్త్రి భావించినట్లుగా తెలుస్తుంది.

కోడిని ఎత్తుకు పోవటానికి వచ్చిన నక్క భయమూ, ధైర్యము, తొందరా, టక్కరితనమూ అన్నీ చూసిన వీరన్నకు తన జీవితం జ్ఞప్తికి వచ్చిందని రచయిత చెప్పటం వల్ల, అడవిలోని నక్క జీవితం కంటే భిన్నంగా జనారణ్యంలోని వీరన్న జీవితం లేదని పాఠకులు గ్రహించటానికే.

నక్క స్వభావాన్ని పునికి పుచ్చుకొన్న వీరన్నకు నక్క కోడిపెట్టను కరుచుకు పోవటం చూడాలని తలంపు కలిగింది. భగవత్సృష్టి సజావుగా సాగటానికి ప్రధాన కారణమైన హింసాకాండను కళ్ళారా చూద్దామని వీరన్న కళ్ళు తహతహ లాడాయంటారు రచయిత. అంతే అదేరీతిగా హింసాకాండను జరిపించటానికి తొందరపడటంలో మానవుని అణువణువున జీర్ణించుకొని వున్న రాక్షసాంశాన్ని బహిర్గతం చేసినట్లయింది.

వీరన్న వీరనాయుడి కోడి పెట్టలను ఎత్తుకు రావటం, తాను శ్రమ పడటంగా భావించాడేగాని, ఇతరుల ఆస్తిని తాను ఎత్తుకొని రావటం తప్పుగా భావించలేక పోయాడు. ఈ విషయం వీరన్న పరాయి స్త్రీని లేపుకొచ్చిన సంఘటనలో కూడా స్పష్టమైంది. అదే పనిని నక్క చేయటానికి వస్తే సహించలేక పోయాడు. తన సౌఖ్యం, తన కష్టం, తన కోపం, తన పగ అన్నీ ఆ నక్కను చూడగానే గుర్తుకు వచ్చి దాన్ని బాగా కర్రతో కొట్టి చంపాడు.

## 3

అటవిక న్యాయమే అయినా చిన్న జంతువులను పెద్ద జంతువులు తినటం, హింసించటం ప్రకృతిలో సహజం. ఈ క్రమాన్ని రావిశాస్త్రి చెదర పురుగులను, కీటకాలను కోళ్ళు తినటం ద్వారా, ఆ కోళ్ళను నక్కలు ఎత్తుకు పోవటం ద్వారా, ఆ నక్కలను కొండ చిలువ మింగి వేయటం ద్వారా చూపిస్తూ, సామాజిక వ్యవస్థలో కూడా బలహీనులను బలవంతులు మోసం చేయటం హింసించటం అనే ప్రవృత్తుల ద్వారా అటవిక న్యాయం కొనసాగటాన్ని చూపించాడు. వీరనాయుడి కోళ్ళను వీరన్న ఎత్తుకు రావటం, ఆ వీరనాయుడు నూకరాజు భూమిని కాజేయటం, మొదలైన సంఘటనల పరంపరలో అటవిక న్యాయం వివిధ రూపాలతో కొనసాగుతుందని భావించవచ్చు. అందుకే రచయిత పశు పక్ష్యాదుల పాత్రలతో పాటు మానవ పాత్రలను కూడా చేర్చి కథను నడిపాడు.

కోడి పెట్టలను నక్క ఎత్తుకపోవటం, నక్క పిల్లలను కొండ చిలువ తినటం, మిగిలిన నక్క

లను వీరన్న చంపటం ద్వారా పశుపక్ష్యాదుల పాత్ర ముగిసినా, అవే లక్షణాలను పుణికి పుచ్చుకొని వీరన్న ముందుకు సాగటం ద్వారా నక్క మానవీకరించబడి మనిషిగా రూపాంతరం చెందిన క్రమాన్ని చూపించినట్లయింది. రచయిత బ్రాకెట్లలో చెప్పిన కథనం ద్వారా దాన్ని నిర్ధారించినట్లుగా భావించవచ్చు. అంతేకాకుండా రచయిత కథా నేపథ్యంగా సాగిన వాతావరణ చిత్రణలో కూడా ఈ విషయాన్ని రుజువు పరిచాడు.

'అర్థరాత్రి దైదీప్యమానంగా వెలుగుతున్న చంద్రుణ్ణి 'గురువుగారికే ఎసర పెట్టిన పక్కా దొంగ' అనీ, ఆయనే గాని భూమ్మీదికి దిగితే ఏ చోర సామ్రాజ్యానికి చక్రవర్తో, ఏ దొంగల దేశానికో ప్రెసిడెంటో అయి తీరగలడని తీర్మానించటం, చంద్రుళ్ళా అందంగా లేకపోయినా వీరన్న కూడా అతనిలాగే మేలుకొనే ఉన్నాడని' రచయిత చెప్పడం ఇందుకొరకే. ఇక్కడ రచయిత చంద్రుణ్ణి దొంగల రాజ్యానికి అధినేతగా వర్ణించటం వల్ల చంద్రుని వెన్నెలంతా విస్తరించినట్లుగా ప్రపంచమంతా ఆ దొంగ స్వభావాన్నే కలిగి వుంటుందని భావించినట్లయింది.

ఇలా బలహీనుల్ని బలవంతులు దోచుకు తినటం సామాజిక ధర్మంగా అభివృద్ధి చెంది ఉనికిలో వున్న సామాజిక వ్యవస్థను 'ఛీ'కొడుతూ 'ఛీ ఈదేవుడి లోకం గురించి ఆలోచిస్తేనే పాపం' అని అనుకొన్న కోడిపెట్ట మాటలద్వారా రచయిత తన నిరసనను వ్యక్తం చేశాడు. ఈ ప్రపంచాన్ని దేవుడే సృష్టించాడన్న విశ్వాసాన్ని పరిగణనలోకి తీసుకొంటే ఈ లోకాన్నిట్లా దోపిడీ పీడనలమయంగా చేసినందుకు ఆ దేవుడిని కూడా వ్యతిరేకించాల్సిందేనన్న భావం రావిశాస్త్రి మాటల్లో ధ్వనిస్తుంది. సృష్టిలో సర్వే సర్వత్రా వ్యాపించి వున్న దోపిడీ, పీడనల లక్షణాన్ని ఒకకోడి, ఒక్క నక్క, ఒకకొండ చిలువ, ఒక్క వీరయ్య, ఒక వీరనాయుడి పాత్రల చుట్టూ కథ నడపటం ద్వారా సమర్థవంతంగా నిరూపించాడు రావిశాస్త్రి. కొడవటిగంటి కుటుంబరావుగారు అభిప్రాయపడ్డట్లుగా' యదార్థ జీవిత చిత్రణ కన్నా కూడా సంకేతాలు జీవితాన్ని మరింత మథించి ఉన్న జీవిత సత్యాన్ని మరింత స్పష్టంగా వ్యక్తం చేస్తాయి.

# పండుగలలో ప్రజాజీవనం

డా॥ ఎం. గోవిందస్వామి నాయుడు

జాతి జాతీయతకు ప్రతీకలు పండుగలు, మానవుని మనోవికాసానికీ పారమార్థిక చింతనకూ పండుగలు దోహదం చేస్తాయి. అందుకే పండుగ–పబ్బం లేని దేశంకానీ రాష్ట్రంకానీ జాతికానీ మతంకానీ లేదంటే అతిశయోక్తి, లేదు అనేక మతాలకు నిలయమయిన మన పవిత్ర భారతదేశంలో పెక్కు పండుగలు ఆచరింపబడుతున్నాయి. ఆచరించే విధానాన్ని బట్టి ఈ పండుగలను గృహసంబంధమయిన పండుగలు, ఆలయ సంబంధమయిన పండుగలు, గృహ ఆలయాలకు సంబంధించిన పండుగలు అని వర్గీకరించి పరిశీలించవచ్చు ఉగాది, దీపావళి, మకర సంక్రాంతి వంటివి గృహసంబంధమయిన పండుగలు, శ్రీరామనవమి, కృష్ణాష్టమి, వైకుంఠఏకాదశి, మహాశివరాత్రి లాంటివి ఆలయ సంబంధమయిన పండుగలు, వినాయక చవితి, దసరావంటి పండుగలు గృహాలలోనూ ఆలయాలలోనూ జరుపబడుతాయి. గృహసంబంధమయిన పండుగలలో స్త్రీల వ్రతాలు, నోములు కూడా సముచిత స్థానాన్ని సంపాదించుకొన్నాయి. కేదార గౌరీవ్రతం, వరలక్ష్మీవ్రతం వంటి వ్రతాలు ప్రముఖంగా చెప్పుకో దగ్గవి. ఈపండుగలతో బాటు ప్రకృతి పూజ రూపంలో మరికొన్ని పండుగ లేర్పడినాయి. తులసిపూజ, నాగపంచమి, రథసప్తమి, వంటివి ఈ కోవకు చెందుతాయి. ఈ పండుగలన్నీ మన తెలుగు వారి జీవన స్రవంతిలో అంతర్వాహినులయి వారి సామాజిక సాంస్కృతిక జీవన వికాసానికి దర్పణాలయ్యాయి.

తెలుగు వారి ముఖ్యమైన పండుగలలో మొదటిది ఉగాది. దీనితో మన నూతన సంవత్సరం ప్రారంభమవుతుంది. ఇది చైత్ర శుద్ధ పాడ్యమి నాడు వస్తుంది. పండుగ అంటే తెలుగు వారికి పారిశుద్ధ్యం ప్రధానం ఉగాదిరోజు అందరూ భవంతిని అలికి ముగ్గులు పెట్టి అలంకరింప జేస్తారు. వాకిళ్ళకు మామిడాకుల తోరణాలు, పూలతోరణాలు కడ్తారు. ప్రాతఃకాలాన్నే లేచి మంగళాభ్యంగన స్నానం చేసుకొంటారు. సంపన్నులయిన వారు కొత్తబట్టలు ధరిస్తారు. నూతన పంచాంగాన్ని, ఆసంవత్సరాధి దేవతను షోడశోపచారాలతో పూజిస్తారు. కొన్ని చోట్ల పౌరాణికపు దేవతా పూజనే గాక గ్రామదేవతలకు కొబ్బరికాయ నివేదన జరుగుతుంది. పలురకాలయిన పిండి వంటలతో బాటు ఉగాది పచ్చడిని తయారుచేస్తారు. షడ్రసోపేతమయిన ఈ ఉగాది పచ్చడిని సుఖ దుఃఖ సమ్మిశ్రితమయిన మానవుని సంవత్సర జీవితానికి ప్రతీకగా భావిస్తారు. భోజనానంతరం స్వగృహంలోనో గ్రామ చావడిలోనో జనమంతా చేరి పంచాంగ శ్రవణం చేస్తారు. ఆ సంవత్సరం

తెలుగు లెక్చరర్ ఎస్వీయు పిజిసెంటర్ కర్నూలు.

తమకు జరగబోయే కందాయ ఫలాన్ని ఆదాయ వ్యయాల్ని పంచాంగం ద్వారా తెలుసుకొని తదను గుణంగా ప్రవర్తించడానికి అనాడే సంకల్పించు కొంటారు. రైతులు సూర్యోదయపు వేళ నాగలిని పూజించి ఎద్దులను అలంకరించి వారి వారి పొలాల్లో అయిదు లేక తొమ్మిది బొళ్లు దున్నుతారు. ఉగాదినాడు కొత్తకుండ పెట్టి మంచినీళ్లు లేవన కుండా అడిగిన వారికి ఇచ్చే ఆచారం కొన్ని గ్రామాలలో ఉంది. ఉగాది యుగ, దిన, మాస, వర్షారంభకాలం అని పెద్దల విశ్వాసం.

ఉగాది తరువాత ముఖ్యమయిన పండుగ దీపావళి. ఇది ఆశ్వీయుజ బహుళ చతుర్దశినాడు వస్తుంది. ఇది రెండు రోజుల పండుగ మొదటిరోజు నరకచతుర్దశి లోక కంటకుడయిన నరకుడు శ్రీకృష్ణునిచే సంహరింపబడింది. ఈనాడే నని ప్రజల విశ్వాసం ఈరోజు కూడా ఇండ్లను శుభ్రపరచి చక్కగా అలంకరింపజేస్తారు. వేకువ జామున్నే అభ్యంగన స్నానంచేసి నూతన వస్త్రాలు ధరిస్తారు. ప్రదోషకాలంలో ప్రాకార, ఉద్యాన వీధుల్లో గుడిగోపురాల్లో దీపాలు వెలిగి స్తారు. కొన్ని ప్రాంతాల్లో నువ్వుల కట్టెలను మోపుగా కట్టి వెలిగించి ఆకాలే కొరువులను వాకిట్లో గుండ్రంగా తిప్పుతారు. దీనివల్ల పితృదేవతలకు మార్గం చూపినట్లవుతుందనే నమ్మకం ఉంది పిల్లలు, పెద్దలు ఉల్లాసంతో బాణసంచా కాలు స్తారు.

రెండో రోజు దీపావళి అమావాస్య. ఈ రోజు గృహ దేవతార్చనతో బాటు అరటిస్తంభాల అలం కరణలూ బంతిపూల దండలూ, మామిడి తోరణాలూ తప్పనిసరి. గౌరీ పూజచేస్తారు. దీన్నే కేదారేశ్వర వ్రతమంటారు. రైతు కుటుంబాల వారు కులా చారంగా వచ్చే కేదార గౌరీ నోమును నోముతూ కొత్త కోడలిచేత తొలిసారి విధి విధానాలతో నోమిస్తారు. ఈ వ్రతాన్ని చాలా నిష్ఠతో ఉపవాసం చేస్తూ గోధూళి వేళ నోముకుంటారు. అరిసెలు ఫలాలు నైవేద్యంగా పెట్టారు. వీటిని కొందరు 108 సంఖ్యకు పరిమితం చేసుకుంటారు. దీన్ని ఎన్నిక అంటారు. మరి కొందరు అసంఖ్యాకంగా సమర్పిస్తారు. దీన్ని రాశి అంటారు. పూజ తరువాత పసుపు పూసిన నోముదారాన్ని చేతికి కట్టుకుంటారు. నూతన వధూవరులను వధువు తల్లిదండ్రులు ఆహ్వానించి నూతన వస్త్రాలు బహూకరిస్తారు. సాయంకాలం ఇంటిని దీపాలతో అలంకరిస్తారు.

దీపావళి తరువాత ప్రాముఖ్యం వహించే పండుగ మకర సంక్రాంతి. ఇది మార్గశిర పుష్య మాసాలలో, సూర్యుడు మకరరాశిలో ప్రవేశించి నప్పుడు ఉత్తరాయణ ప్రారంభంలో వస్తుంది. ఈ సమయానికి పంటలుపండి ఇంటికి వచ్చి సమృద్ధి గా ఉంటుంది. గనుక దీన్ని పెద్దపండుగ అంటారు. ఇది మూడురోజుల పండుగ మొదటి రోజు భోగి. రెండవనాడు సంక్రాంతి. మూడవనాడు కనుము.

భోగి పండుగకు ముందునాటిరాత్రి పాత చీపురూ, చేటా, చినిగుడ్డలు మొదలయిన పనికిరాని వస్తువులన్నీ సేకరిస్తారు. వేకువఝామున్నే లేచి ఈ వస్తువులతో భోగిమంటలు వేస్తారు. ఈమంటల్లో కాలిపోయిన పనికిరాని వస్తువులు తమదారిద్ర్యాన్ని భస్మం చేస్తూ లక్ష్మిని కటాక్షింప జేస్తాయని ప్రజల విశ్వాసం. ఆతరువాత అందరూ తలంటిస్నానాలు చేస్తారు ఆడపిల్లలు ఒకరితో ఒకరు పోటీపడేటట్టు వాకిట్లో ముగ్గులు పెట్టి మధ్యలో ఆవుపేడతో చేసిన గొబ్బెమ్మలు పెడ్తారు. వీటిపైన గరిక నుంచి పసుపుకుంకుమలతో అలంకరిస్తారు. సాయంకాలం

పిల్లలకు పండ్లు పోసి పేరంటం చేస్తారు. దీన్నే 'భోగిపళ్ళు' అంటారు. కొన్ని ప్రాంతాల్లో భోగి మంటల చుట్టూ స్త్రీలు, పిల్లలూ చప్పట్లు కొడుతూ, జానపద గేయాలు, సంకీర్తనలు పాడుతూ తిరగడం పరిపాటి.

రెండవనాడయిన సంక్రాంతిరోజు తర్పణ శ్రాద్ధాదులు జరిపితే పుణ్యలోకం ప్రాప్తిస్తుందనీ ఆనాడు 'నాస్తి' అనే శబ్దం ఉండరాదనీ దానాలు చేయాలని ధర్మశాస్త్రాలు చెబుతున్నాయి. అందువల్ల ఈనాడు కూడా అందరూ అభ్యంగన స్నానాలు చేసి ఉపవాసంతో తర్పణ శ్రాద్ధాదులు నిర్వహించి పితృదేవతలకు తిలోదకాలిస్తారు. ప్రకృతిదేవతయిన సూర్యుణ్ణి పూజిస్తారు. చక్కెర పొంగలిని నైవేద్యమిస్తారు. రకరకాల పిండివంటలు చేసి ఆరగిస్తారు. కొందరు సంక్రాంతి బొమ్మలకొలువు పెడతారు. ఈ కొలువులో సావిత్రీ పూజకు ప్రాధాన్యం ఎక్కువ. ఈ బొమ్మల కొలువు విజ్ఞానానికి అలంకరణకూ, కళాభిరుచికీ సంకేతమయిన మన జాతీయ జీవనవిధానాన్ని చాటుతుంది. సాయంకాలం చిన్నవారు పెద్దవారికి నమస్కారాలు చేస్తారు. కనుక సంక్రాంతికి మొక్కుల పండుగ అనే పేరు కూడా ఉంది.

మూడవ నాటి కనుమ పండుగ పూర్తిగా కర్షకుల పండుగ తమ కృషికి బాసటగా నిలిచిన పశువులను కడిగి అలంకరించి కొమ్ములకు రంగులు పూసి అలంకరింపజేస్తారు. పశువుల పాకలు శుభ్ర పరచి పొంగళ్లు పెడతారు. అది ఉడుకుతున్నప్పుడు 'పాలపొంగలి పసులపొంగలి' అని కేకలువేసి దేవతలకు నైవేద్యమిస్తారు. పొలాలకు వెళ్లి ఆ పొంగలిని పసుపుకుంకుమలతో కలిపి వెదజల్లుతారు. దీన్నే 'పొలిచల్లడం' అంటారు. సాయంకాలం పశువులను పూలదండలు, గజ్జెలు పట్టెడలతో అలంకరించి ఊరేగిస్తారు. చక్కెర పొంగలి తినిపిస్తారు. పొలిమేర్లలో ఎడ్ల పోటీలూ పొట్టేళ్ల పోటీలూ కోడి పందేలు జరుగుతాయి. తమిళనాడులోనూ కొన్ని సరిహద్దు తెలుగు ప్రాంతాల్లోనూ ఎడ్ల కొమ్ములకు డబ్బులు కట్టి పరుగెత్తించి వాటిని విప్పుకొనివచ్చే పోటీలు నిర్వహిస్తారు. బుడబుక్కలూ, దాసర్లూ, దొమ్మర్లు వారివారి కళలనూ నృత్యాలను ప్రదర్శిస్తూ భిక్షం తీసుకుంటారు. అన్నిటికన్నా గంగిరెద్దుల ఆట ముఖ్యం.

స్త్రీలు భోగినాటినుండి గొబ్బి గౌరీవ్రతం జరుపుతారు. భోగినాటి సాయంకాలం మండపాన్ని నిర్మించి పూలతో, పండ్లతో అలంకరించి బంకమట్టితో గౌరీ విగ్రహం చేసి పూజిస్తారు. పూజానంతరం పాటలు పాడి గొబ్బిళ్లు తట్టి పేరంటం చేస్తారు. నాల్గవ నాటి సాయంకాలం గొబ్బి గౌరిని చెరువులోగానీ నదిలోగానీ ఓలలాడిస్తారు. ధనుర్మాసంలో పొంగలి వండడం వైద్య శాస్త్రం ప్రకారం ఆచారమయింది. ఈ ఆచారం దేవాలయాలకు ప్రాకింది. ఇలా ఇహపరాలకు నిచ్చెన వేస్తూ ఉత్సాహ ఉల్లాసాలను కలిగించే పండుగ సంక్రాంతి.

స్త్రీల మాంగల్య రక్షణ కొరకో, సంతాన ప్రాప్తి కొరకో, ధనధాన్యాది సమృద్ధి కొరకో, ఏర్పడినవే వ్రతాలు నోములు. ప్రతినోముకూ వ్రతానికీ పేరంటం ముఖ్యం, ఈ వ్రతాలు సమాజానికి కళాపోషణకూ కలుపుగోలుతనానికీ ప్రతీకలు. వీటిలో కేదారగౌరి, వరలక్ష్మీవ్రతాలు ప్రధానంగా చెప్పుకోదగ్గవి. దీపావళి అమావాస్య నాడు ఆచరించబడేదే కేదార గౌరీ వ్రతం.

వరలక్ష్మీవ్రతం శ్రావణ పూర్ణిమకు వెనుక వచ్చే శుక్రవారం జరుపుకుంటారు. దీన్ని స్త్రీలు

నిష్ఠతో ఆచరిస్తారు ఉదయమే మంగళస్నానం చేసి కొత్త బట్టలు ధరిస్తారు. ఇంటి శవంతిలోగానీ మరొక చోటగానీ మంటపం కట్టి దాని మధ్య ముగ్గులతో అలంకరించి కలశం స్థాపించి దాని మీద కొబ్బరికాయ పెట్టి లక్ష్మీరూపం చేస్తారు. లక్ష్మిని ఆవాహనం చేసి షోడశోపచారాలతో పూజిస్తారు. పూజానంతరం పసుపుపూసిన తోరం చేతికి కట్టు కొంటారు. అవిరి కుడుములు వంటి తినుబండారాలను నైవేద్యమివ్వడం ఆచారం.

ఆలయ సంబంధమయిన పండుగలలో మొదట లెక్కించవలసింది శ్రీరామనవమి. ఇది చైత్రశుద్ధనవమినాడు వస్తుంది. శ్రీరామనవమినాడు ప్రజలు ఉపవాస జాగరణలు చేసి దశమినాడు భక్తితో రాముని పూజిస్తారు, చైత్రశుద్ధపాడ్యమి నుండి రామనవరాత్రి ఉత్సవాలు జరుపుతారు. ఈ తొమ్మిదిరోజులూ పగలు వాల్మీకిరామాయణం, రాత్రిపూట రామకథాకాలక్షేపాలు జరుగుతాయి. నవమినాడు రామ జననఘట్టం చదివి పూజలు నిర్వహిస్తారు పానకం వడపప్పు ఆరగింపుపెట్టి ఆశ్రితులకు ప్రసాదంగా పంచుతారు. దశమినాడు రామపట్టాభిషేకఘట్టం చదివి పట్టాభిషేకోత్సవం చేస్తారు. సీతారామలక్ష్మణులను అన్ని విధాల ఆదర్శప్రాయులుగా మనదేశ ప్రజలందరూ కొలుస్తున్నారు.

శ్రీరాముని తర్వాత తెలుగువారికి ఆరాధ్య దైవం శ్రీకృష్ణుడు. ఈ మహాపురుషుని జన్మదినోత్సవం కృష్ణాష్టమి. దీన్ని శ్రావణ బహుళ అష్టమినాడు జరుపుతారు. ప్రజలు అష్టమినాడు పగలంతా ఉపవాసం చేసి సాయంకాలం పూజలు జరుపుతారు. జననసూచకంగా ఉయ్యాలలు కట్టి కృష్ణుని ఆడించడం. విగ్రహాన్ని పడుకోబెట్టి పూజించడం ఆనవాయితీ. శొంఠి, బెల్లం కలిపిన వెన్నను, వివిధ భక్ష్యాలను నైవేద్యం పెట్టడం ఆచారం. బాలకృష్ణుడు వ్రేపల్లెలో జరిపిన లీలలకుచిహ్నంగా వీధుల్లో కట్టకట్టడం, వాటిని పోటాపోటీలతో కొట్టడం వంటి బాలక్రీడా వినోదాలు దేశమంతటా జరుపుకొంటారు.

వైకుంఠ ఏకాదశిని ముక్కోటి ఏకాదశి అని కూడా వ్యవహరిస్తారు. మార్గశిర శుద్ధ ఏకాదశిని వైకుంఠ ఏకాదశిగా జరుపుకుంటారు. శిష్టులు ఏకాదశీ వ్రతాన్ని కఠినంగా ఆచరిస్తారు. దశమి నాటి రాత్రి ఉపవాసం ఉండి ఏకాదశిరోజు పూర్తిగా ఉపవాసం చేసి ద్వాదశినాడు ఉదయం పారణ చేస్తారు. ఈ ఏకాదశి నాటికి ఉత్తరాయణం ప్రారంభం కావడంవల్ల ముప్పదిమూడు కోట్ల దేవతలూ ఈనాడు భూలోకానికి దిగి వస్తారని పెద్దల నమ్మకం.

శివలింగోద్భవ పుణ్యకాలం శివరాత్రి. ఇది మాఘ బహుళచతుర్దశి నాడు ఆచరింపబడే శివ భక్తుల పండుగ. భక్తులు ఈనాటి ఉదయం స్నానం చేసి ఉపవాసం చేస్తూ రాత్రి జాగరణ చేసి మరుసటి ఉదయం పారణ చేస్తారు. రాత్రిపూట హరికథలతో పురాణ కాలక్షేపం చేస్తారు. ధూప దీపనైవేద్యాలతో లింగార్చన చేస్తారు. మాఘ బహుళ చతుర్దశినాడు ఉపవాసం చేస్తూ చేసే శివ పూజ అనంత పుణ్యదాయకమయి జన్మజన్మల పాపాలను పోగొడుతుందని జనుల విశ్వాసం.

ఇండ్లలోనూ దేవాలయాలలోనూ విధిగా జరుపబడే పండుగ వినాయక చవితి. ఇది భాద్రపద శుద్ధ చవితినాడు వస్తుంది. ప్రతి శుభకార్యం మొదట్లో ఆరాధింపబడే వినాయకుడు భాద్రపద శుక్ల చతుర్థినాడు జన్మించినట్లు పరిగణించబడటం వల్ల ఆదినం విశేషపూజలు జరుపుతారు. ఆరోజు

ఉదయమే మంగళస్నానం చేసి బంకమట్టితో చేసిన వినాయక విగ్రహాన్ని చేస్తారు. ఇంటి శవంతిలో అరుగు మీద పీట వేసి దానిమీద వడ్లుగానీ బియ్యం గానీ పోస్తారు, దాని మీద వినాయకుని ఆవాహన చేసి పూజలు జరుపుతారు. తులసి, బిల్వం, జిల్లేడు, దేవదారు వంటి ఇరవయి ఒక్క పత్రులతోనూ పూలతోనూ పూజిస్తారు. కుడుములు, ఉండ్రాళ్ళు ప్రత్యేకంగా నైవేద్యం పెడ్తారు. ఇవేగాక నేరేడు, వెలగ మొదలయిన పండ్లన్నీ నివేదిస్తారు. మరు నాడు సాయంకాలం విగ్రహాన్ని నదిలోనో చెరువులోనో, నిమజ్జనం చేస్తారు. కొన్ని ప్రాంతాలలో విగ్రహాన్ని ధాన్యపు గాదెలలో ఉంచడం ఆచారం, దీని వలన ధాన్యం తగ్గకుండా ఉంటుందని, అపుత్రులు పుత్రవంతులవుతారని ప్రజల విశ్వాసం.

విజయ సూచకాలయిన పండుగలలో వినాయక చవితి తరువాత చెప్పుకోదగిన పండుగ. దసరా, ఇది మహాలయ పక్షము, నవరాత్రులు, విజయ దశమిలతో. ముడిపడిన సమిష్టిపండుగ. భాద్రపద బహుళ పక్షాన్ని మహాలయ పక్షమంటారు. దీని చివరి అమావాస్య మహాలయ అమావాస్య, ఈ పక్షంలో పితృదేవతలకు తర్పణ శ్రాద్ధాలు జరుపుతారు. అన్ని కులాల వారూ తమ పెద్దలు మరణించిన తిథులను బట్టి శ్రాద్ధ కర్మలు నిర్వహిస్తారు. అమావాస్యనాడు విశేషంగా తర్పణాదులు దాన ధర్మాలు చేస్తారు.

మహాలయ అమావాస్య తరువాత దేవీనవరాత్రి ఉత్సవం ప్రారంభమవుతుంది. పాడ్యమితో ప్రారంభమయిన ఈ నవరాత్రులు మహర్నవమితో మధ్య పరిసమాప్తమవుతాయి. ఈ తొమ్మిది రోజులూ దుర్గను పూజిస్తారు. శాక్తేయులు మాంసరక్త తర్పణలు చేస్తారు. సప్తమినాడు సరస్వతీ పూజ చేస్తారు, దుర్గాష్టమినాడు బతుకమ్మ పండుగ తెలంగాణాలో ప్రసి బతుకమ్మ అంటే గౌరమ్మ, పలురకాలయిన పూలతో పళ్లెంలో గోపురాకారంగా పేర్చి చందమామ పాటలు, ఉయ్యాల పాటలు పాడి గొబ్బిళ్ళు తట్టి ఊరేగిస్తారు. విజయ దశమినాడు నదిలోకాని చెరువులోకాని ఓలలాడిస్తారు, చక్కెర కలిపిన వేరు వేరు ధాన్యపు పిండ్లు ప్రధాన నైవేద్యం. నవమి రోజు క్షత్రియ కర్షక కార్మికులు తమ తమ ఆయుధాలను, పని ముట్లను, పూజిస్తారు, ఇదే కొన్ని ప్రాంతాలలో ఆయుధ పూజగా మారింది, విచిత్రవేషాలు వేయడం, బొమ్మలు కొలువులు తీర్చడం ఆచారమయింది.

నవరాత్రుల తర్వాత ఆశ్వయుజ శుద్ధదశమి నాడు జరుపుకొనే పండుగ విజయ దశమి, ఈనాటి ఉదయం ప్రజలు తలంటు పోసికొని నూతన వస్త్రాలు ధరించి ఇష్టదైవాన్ని కొలుస్తారు. మృష్టాన్నాలు భుజించి సాయంకాలం మేళతాళాలతో ఊరు పొలిమేర దాటి జమ్మి చెట్టును పూజిస్తారు. పెద్దలకు జమ్మి ఇచ్చి నమస్కరించి ఆశీరాద్వాలు పొందుతారు.

ప్రకృతి దేవతలను, ప్రకృతిలోని వృక్షాదులను పూజించడం కోసం ఏర్పడినవి. ప్రకృతి సంబంధమయిన పండుగలు, ప్రకృతి దేవతలలో ప్రధానమయిన సూర్యునికి సంబంధించిన పండుగ రథసప్తమి. దీన్ని మాఘశుద్ధ సప్తమినాడు జరుపుకుంటారు. షష్ఠిరోజు రాత్రి ఉపవాసం చేసి సప్తమినాడు అరుణోదయానికి ముందే నదిలో దీపం వదలి స్నానం చేస్తారు. స్నానం చేసేటప్పుడు ఏడు జిల్లేడాకులు, ఏడు రేగాకులు తలమీద పెట్టుకుంటారు. సూర్యమంత్రం జపించి సూర్యునికి అర్ఘ్యమిస్తారు. పొంగళ్ళు పెట్టి నైవేద్యం పెడ్తారు. రథసప్తమిని సూర్య ఆరాధనోత్సవమని భావిస్తారు.

వృక్ష పూజలన్నిటిలో ముఖ్యమయింది తులసి పూజ. దీన్ని కార్తీక శుద్ధద్వాదశి నాడు సాయంకాలం చేస్తారు, సర్వరోగ నివారిణి అయిన తులసి మొక్కను దేవతగా చేసి నిత్యార్చనలో ఉంచుతారు. ఈ ద్వాదశినాడు స్త్రీలు ఉదయమే అభ్యంగన స్నానమాచరించి పూజలు చేస్తారు. భోజనమయిన పిదప సాయంకాలం తులసి కోటను — బృందావనాన్ని అలంకరించి దీపాలు పెట్టి విష్ణువుతో తులసి వివాహం చేస్తారు. ఈ పూజను స్త్రీలు ఇహపర సాధకంగా భావించి చేస్తారు.

అతి ప్రాచీనమయిన నాగపూజకు చిహ్నమే నాగ పంచమి లేక నాగుల చవితి. దీన్ని మన తెలుగు నాట శ్రావణ శుద్ధపంచమినాడు, కార్తీక శుద్ధ చవితినాడు జరుపుకుంటారు. మొదటిదానికి నాగపంచమి అన్నీ రెండవ దానికి నాగుల చవితి అనే పేర్లు. నాగ పంచమినాడు ప్రజలు శిరస్స్నానం చేసి ఉపవసించి పుట్టలో పాలు పోసి చలిమిడి నివేదిస్తారు తరువాత దారం పసుపు కట్టిన వేసిన వస్త్రాలను, యజ్ఞోపవీతాలను పుట్టపై అలంకరించి పుట్టను పూజిస్తారు. వేపచెట్టును పూజించడం పరిపాటి. ప్రతిగ్రామంలోనూ వేపచెట్టు మొదట్లోనో, రావిచెట్టు మొదట్లోనో స్థాపించిన నాగ విగ్రహాలకు పూజలు చేయడం ఆచారం. పాములు పంటలను అభివృద్ధి పరుస్తాయనీ, సంతాన ప్రాప్తి కలిగిస్తాయనీ ప్రజలు భావిస్తారు దీన్నిబట్టి వృక్షాలను, సర్పాలను పూజించే ద్రావిడ సంప్రదాయం మనకున్నట్టు చెప్పవచ్చు.

పండుగలు సాధారణంగా పనులతో సతమతమయ్యే వారి విశ్రాంతికోసం, ఉల్లాసంకోసం కల్పింపబడినట్టుగా తోస్తుంది. ఏదిఏమైనా మానవుల నిత్య జీవితాల్లో ప్రముఖస్థానం సంపాదించుకొన్న ఈ పండుగల వల్ల వారి జీవన విధానంలోని గృహాలంకరణ, వస్త్రధారణ, ఆహారపద్ధతులు వంటి సామాజిక అంశాలు ; ఆచార వ్యవహారాలు, నమ్మకాలు, పూజ పునస్కారాలు, వినోదాలు వంటి సాంస్కృతిక అంశాలు కొంతవరకు వ్యక్తమవుతున్నాయి. అందువల్ల పండుగలు మన నాగరికతకూ సంస్కృతికీ ప్రతీకలుగా నిలుస్తున్నాయి.

# స్వర్గీయ మోటూరి సత్యనారాయణ

మిక్కిలినేని సుబ్బారావు

'పురుషులందు పుణ్యపురుషులు వేరయా' అని వేమన యోగి ప్రవచించాడు. సంకుచితార్థంలో పూర్ణపురుషుడు శతాయుష్కుడు. విస్తృతార్థంతో కర్మయోగి, గాంధీజీ పిలుపు నందుకొని మోటూరి సత్యనారాయణగారు జాతీయోద్యమంలో పాల్గొన్నారు. గాంధీగారు దేశవాసుల కిచ్చిన నిర్మాణ కార్యక్రమంలో ప్రాముఖ్యతను సంతరించుకొన్న హిందీ ప్రచార పుద్యమానికి వారు సారథ్యం వహించి అంతిమశ్వాసవరకు హిందీ భాషకు అంకిత మైన మహనీయులు. వారు 93 సంవత్సరాలు జీవించారు హిందీ ప్రచారకులకు పితామహులు దక్షిణ భారత హిందీ ప్రచార సభకు, సత్యనారాయణగారు చరిత్రలో పర్యాయపదంగా నిల్చిపోయారు. అందుకనే ఆంధ్రులకే కాకుండా భారతావనికే ప్రశంసనీయుడైన గాంధేయ అభయ ప్రచారకులు, సందేశకర్తలు మోటూరివారు.

భారతీయులలో ఏదేశమేగినా, ఏపదవిలో వున్నా గాంధీటోపీని విడిచిపెట్టని ఆరుగులు కీ॥శే॥ అయ్యదేవర కాళేశ్వరరావుగారు, దివంగత ప్రధానమంత్రి లాల్‌బహదూర్‌శాస్త్రిగారు... ఈద్పుగంటి రామచంద్రరావుగారు. నాకు తెలిసిన ఆంధ్రులు కీ॥శే॥ కాసు బ్రహ్మానందరెడ్డిగారు. ఆంధ్రత్వము పుణికి పుచ్చుకొన్న ఉత్తరీయం కండువా టోపీనిత్యము ధరించిన మరోవ్యక్తి మన సత్యనారాయణగారే. ఇది వారి వేషధారణలోని విశిష్టత.

సత్యనారాయణ బహుభాషాకోవిదులు. ఏకసంతగ్రాహి. అనువాదంలో అద్వితీయులు. పూజ్యగాంధీజీ చేసిన దక్షిణయాత్రల్లో వారే అనువాదకులుగా వున్నారు. వారికి రాజ్యాంగసభ సభ్యత్వం లభించింది. 'రాజభాష' అధికరణంలో భారత ప్రభుత్వవిధానమును (పాలసీని) రూపొందించటంలో సత్యనారాయణగారి ప్రతిభ, త్రివేణీ సంగమంలో సరస్వతివలె అంతర్వాహినిగా వున్నట్లు నిక్షిప్తమైవున్నది రాజ్యాంగమునకు హిందీ అనువాద సమితిలో వారు కీలక పాత్ర వహించారు. ఇది వారి పాండితీ ప్రకర్షకు నిదర్శనము.

వారు రాజ్యసభ సభ్యులుగా రాష్ట్రపతిచే నియమితులైనప్పుడు వారిభాషలో హిందుస్తానీ నుడికారం సరళమై సులభమై, సామాన్య జన గ్రాహ్యమై వుండేది. మాతృభాష తెలుగులో కూడ తేటతెలుగుతనాన్ని, మాధుర్యాన్ని శ్రోతలకు అందిస్తూ 'దేశ భాషలందు తెలుగులెస్స' అను నానుడిని సార్థకం చేశారు అదే గాంభీర్యంతో

శ్రీచక్ర అపార్ట్‌మెంట్స్, దాసరివారి వీధి, విజయవాడ-2

అన్యభాషలలో మాట్లాడేవారు. వారు సరస్వతీ కృపా పాత్రులు.

శ్రీ సత్యనారాయణగారు మచిలీపట్టణంలోని జాతీయకళాశాల విద్యార్థి, రాంభరోసే శ్రీవాస్తవ గారికి అంతేవాసియై, హిందీప్రచారకుడై, మద్రాసు నగరంచేరి హరిహరశర్మగారి మార్గదర్శకత్వంలో తొలుత నగర ప్రచారకునిగా పనిచేయటమే ఆయన వ్యక్తిత్వ నిర్మాణమునకు బాటవేసింది అది వుమ్మడి మద్రాసురాష్ట్రము. జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్న రోజులవి. నాల్గుప్రాంతాల దేశభక్తులతో వారికి పరిచయం కల్గింది. నాల్గు భాషల వాతావరణమున్నందున కొద్దికృషితోనే ఆభాషలను నేర్చుకోగల్గారు. గాంధీగారి ఆశీస్సులు లభించగా దక్షిణభారత హిందీ ప్రచారసభకు రెండవ ప్రధాన కార్యదర్శికాగానే వారికర్మక్షేత్రం బహుముఖంగా సాగింది త్యాగరాయనగరులో ప్రస్తుతమున్న సభను నెలకొల్పటానికి సుమారు ఐదు ఎకరముల భూమి మద్రాసు కార్పొరేషను నుండి దీర్ఘకాలమునకు లీజుగా తీసుకోబడింది. వెంటనే వారి మేధస్సు ప్రణాళికను తయారు చేసింది. 1936 నాటికి సభ ప్రధాన కార్యాలయం, గాంధీ కుటీరము, కార్యకర్తల నివాస గృహములు, హిందీ ప్రచార ప్రెస్సు, విద్యార్థుల హాస్టలు మొదలైనవి నిర్మించబడ్డాయి. పెద్ద బావి త్రవ్వబడి అందులో బి.డి. నాయుడుగారు తయారు చేసిన వర్టికల్ సెంట్రిఫ్యూగల్ మోటారు బిగించబడి పుష్కలంగా నీటి సరఫరాకు తగు ఏర్పాటు చేయబడింది. 1936లో పండిత నెహ్రూ గారు భవన సముదాయాన్ని ప్రారంభం చేశారు. ఆంధ్ర కర్నాటక, తమిళ, కేరళ ప్రాంతీయ శాఖలు ఏర్పడ్డాయి. హిందీకి మహర్దశ మొదలైంది. దక్షిణాదిన హిందీ మారుమూల గ్రామాలకు ప్రాకింది. గాంధీజీ 'రాష్ట్రభాష' ప్రచార కార్యక్రమం విజయవంతమైంది.

ఆకాలంలోనే హిందీ ప్రచారము కొత్త వూపు అందుకొంది. మద్రాసు రాష్ట్రానికి రాజాజీ ముఖ్యమంత్రిగా వున్నారు. వారికిని సత్యనారాయణ గారికిని వున్న మైత్రీ సంబంధం గురుశిష్యులను పోలింది. డా॥ పట్టాభిగారి నిర్మాణ కౌశలం, రాజాజీగారి మేధాసంపత్తి గాంధీగారి నిష్కామకర్మ యోగము మోటూరిని ప్రభావితం చేశాయి వారి జీవితసరళి యీవిషయాన్ని ధృవపరుస్తున్నది

1937లో సెకండరి పాఠశాలలన్నిటిలోను హిందీని నిర్బంధభాషగా నేర్పుటకు ప్రభుత్వాదేశం లభించింది. అయితే హిందీ పండితులూ, పాఠ్య గ్రంథాలూ పెద్దసవాలుగా పరిణమించినవి. అప్పుడు సత్యనారాయణగారు ముఖ్యమంత్రి రాజాజీకి హామీ యిచ్చారు. సభ పాఠ్యక్రమంలో యుద్ధప్రాతిపదికపై మార్పులు చేశారు. ప్రవేశికను రద్దుపర్చారు. రాష్ట్రభాష ప్యాసయిన వారు తిన్నగా హిందీ విశారద విద్యాలయాల్లో చేరటానికి అవకాశం కల్పించారు. వాటిని ఛలాంగ్ విశారద విద్యాలయాలంటూ నవ్వుకొనేవాళ్ళం. రెండు సంవత్సరాలలో 5000 మంది ఉపాధ్యాయులు తయారయ్యారు. ఇక పాఠ్యపుస్తకాల సమస్య: ప్రారంభ తరగతులకు హిందుస్తానీ రీడర్లు అతి స్వల్పకాలంలోనే ముద్రించబడ్డాయి. అందలి పాఠముల విశేషమేమిటంటే ప్రతి పాఠము నాగరి, ఉర్దూ లిపులలో వుండేది. అప్పటి విశారద పాఠ్యక్రమంలో అందరికీ వుర్దూ లిపిని నిర్బంధం చేశారు.

అప్పటిలో స్వామి వెంకటాచలం చెట్టియార్ విద్యాశాఖామాత్యులుగా వుండేవారు. పాఠశాలల్లో

పనిచేయు హిందీ పండితులకు కనీస వేతనం నెలకు 30/ లు వుండేది. అయితే అందుకు స్కూలు ఫైనలులో ఉత్తీర్ణత కూడ అవసరమని విశారద డిగ్రీలో చేర్చారు. ఈ విషయంలో దక్షిణ భారత హిందీపండిత సంఘం ప్రభుత్వానికి అనేక విజ్ఞప్తులు చేసి ఎట్టకేలకు అన్యభాషా పండితులకువలె హిందీ భాషా పండితులకు కూడ ఆంగ్ల భాషా జ్ఞానానికి నిబంధనను తొలగించేట్లు చేసి కల్గింది.

పండితులకు యీ క్రింద వేటిని పద్ధతి వుండేది:—

(1) 10 సంవత్సరములు సర్వీసు వున్న వారికి ప్రచారక ట్రైనింగుతో నిమిత్తం లేకుండానే 30 రూపాయం స్కేలు,

2 కొత్తగా చేరిన వారికి కూడ అదే స్కేలు.

3 మద్రాసు విశ్వవిద్యాలయం నడుపుచున్న హిందీ విద్వాను డిగ్రీ కల్గిన వారికి బి. యిడి. స్కేలు అంటే 45–3–75,

4. సభ ద్వారా గ్రీష్మకాలంలో Re-Orientation కొరకు సర్వీసులో వుండి,ట్రైనింగ్ లేనివారికి స్వల్పకాలిక ప్రచారక ట్రైనింగు పొందుటకు ప్రభుత్వం అవకాశం కల్పించింది. అట్టి తరగతులకు బాలచంద్ర ఆప్టేగారు ప్రిన్సిపాలుగా వుండేవారు. రా. శాస్త్రిగారు భాషా విజ్ఞాన్ బోధించేవారు. మున్షీగారు వుర్దూ నేర్పేవారు. సత్యనారాయణగారు స్వయంగా గంట వ్యవధితో 40 నిమిషాలు ఏదైనా విషయాన్ని తీసుకొని ఉపన్యసించేవారు. మిగిలిన 20 నిమిషాలు ఆ విషయాన్ని గురించి ప్రశ్నలువేసి సందేహ నివృత్తి చేసుకోవటానికి అవకాశం యిచ్చేవారు. ఈ ప్రకారం వారిబోధనాపద్ధతి సంవాదపద్ధతిలో నడిచేది, అది వారి ప్రత్యేకత. వారి క్లాసు క్రమ శిక్షణకు మారుపేరు. వారు వస్తున్నారంటేనే బోధకులు, కార్యకర్తలు వారి వారి విధులలో నిమగ్నమై వుండేవారు.

వారి స్వభావం ఒక్క రకంగా డిక్టేటరుషిప్పు కార్యకర్తలలో కొందరు సోషలిస్టులుండేవారు; కాని వారంతా చాటున మాట్లాడుకొనవలసిందే, వారు ముఖాముఖీని హేతుబద్ధంగా సత్యనారాయణ గారిని ఎదుర్కొనలేక పోయేవారు. అయితే కార్యకర్తల్లో అసంతృప్తి మిగిలింది. అది వారు పరమపదించే వరకు కొనసాగింది. వారు చివరకు హిందీ ప్రచారకునిగానే లక్ష్యసిద్ధితో కైవల్య సిద్ధిని పొందారు.

స్వాతంత్ర్యం వచ్చినతరువాత హైదరాబాదులోను ఢిల్లీలోను హిందీ ప్రచార శాఖలు ఏర్పరచారు సత్యనారాయణ గారు ఆప్టే గారిని ఢిల్లీకి, ఆంజనేయ శర్మ గారిని హైదరాబాదుకు పంపుటలో వారి విజ్ఞత, దూరదృష్టి కన్పడుతుంది. 1956లో విశాలాంధ్ర ఏర్పడింది. హైదరాబాదు ఆంధ్ర ప్రదేశ్‌కు రాజధాని నగరమైంది. ఆంజనేయ శర్మగారి బుద్ధి కుశలత వలన ఖైరతాబాదులోని భవనాన్ని ఖరీదుచేసి, ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘం, విజయవాడను, ద.భా. హిందీ ప్రచార సభ, హైదరాబాదును విలీనం చేసి ద.భా. హిందీ ప్రచార సభ ఆంధ్ర, హైదరాబాదు అని నామకరణం చేశారు. ఆ కాలంలోనే ఆంధ్ర శాఖ ఆచార్య రాధాకృష్ణన్ అధ్యక్షతను రజతోత్సవం జరుపుకుంది. మోటూరి వారికి వారి బహుముఖ సేవలకు గుర్తుగా రాజేంద్రబాబు గారి అధ్యక్షతను అభినందన గ్రంథం సమర్పించబడింది. ఈ గ్రంథమునకు ఆంధ్రప్రదేశ్ మేఁ హిందీ ప్రచార్ కా ఆందోళన్ అని పేరు.

వారికి ప్రారంభంతో సంతానంలేదు. బంధువుల బాలికను పెంచుకొన్నారు. తరువాత తామర తంపరగా వారికి సంతానం కల్గింది. రాజ్య సభ్యులైన తర్వాత వారికి కేంద్ర ప్రభుత్వపు వివిధ సంస్థలతోను వ్యక్తిగత సంస్థలతోను సంబంధం ఏర్పడింది వారి పిల్లలందరు యోగ్యులుగా పేరు చిక్కింది. తీరికలేనంతగా పనుల్లో నిమగ్నమై వుండి కూడ వారు గాంధీ ఆశయాల ప్రకారం జీవించారు. హిందీ భాషా సేవ చేశారు. తెలుగుభాషా సర్వస్వానికి సంపాదకులుగా వుంటూ ఆంధ్రభాషకు సేవలందించారు. అదే విధంగా ముక్త్యాల కుమారరాజా గారితో కలిసి పులిచింతల, నాగార్జునసాగరు ప్రాజెక్టుల ద్వారా ఆంధ్రప్రదేశ్‌ను సుజలాం,సుఫలాం, సస్యశ్యామలాం చేయుటకు ఎంతో కృషిచేశారు.

పత్నీ వియోగం తర్వాత వారు నీరసపడ్డారు. 1992 జనవరి 10, 11 తేదీల్లో విజయవాడలో జరిగిన ఆంధ్రప్రదేశ్ హిందీ సభలలో వారు పాల్గొని ఎంతో స్ఫూర్తినిచ్చారు.

మరల 1993లో మద్రాసులో జమ్నాలాల్ బజాజుగారి చిత్రపటావిష్కరణ మహోత్సవంలో పాల్గొన్నప్పుడు వారి వాణీవిలాస వైభవాన్ని చూచి మురిసిపోయాము. రామకృష్ణ బజాజ గారు ముఖ్య అతిథులు, సత్యనారాయణ గారు జమ్నాలాల్ గారు యిచ్చిన పిరాశమునను వడ్డీ పైసలతో చెల్లించి ఋణ విముక్తులమైనాము అని వివరించిన పిమ్మట రామకృష్ణ బజాజుగారు ముసి ముసి నవ్వులతో మేము వ్యాపారస్తులం, సభవారు మా ఖాతానిల్వను చూపుతారని ఆశించాను, ఇప్పుడు అలాలేదు. అయితే మా తండ్రి గారు ఒక ఆదర్శాన్ని నెలకొల్పారు. వారి ఆదర్శానికి అనుగుణంగా లక్ష రూపాయల విరాళం యిస్తున్నా'నని ప్రకటించారు.

పండిపోయిన మేధస్సు. తీర్ఘమైనకాయము, తెల్లని దుస్తులలో, గాంధీటోపీధారి, కండువా ధరించిన ఆపద్మభూషణుడు భారతమాతకు భూషణుడు. వారు చూపిన బాటలో హిందీ ప్రచారకులమందరం సమవేత స్వరంతో 'చరైవేతి, చరైవేతి, చరైవేతి' నినాదంతో ముందుకుసాగుతూ ప్రగతిని సాధిద్దాం. ఇదే వారికి శ్రద్ధాంజలి.

## కాలగర్భంలో దాగిన కొన్ని సత్యాలు

1. 1933వ సంవత్సరంలో వీరులపాడు, (పశ్చిమ, కృష్ణాజిల్లా) గ్రామంలో హిందీసభ జరిగింది. మోటూరి సత్యనారాయణగారు ముఖ్య అతిథి. అప్పటికే పశ్చిమ కృష్ణాజిల్లా హిందీ ప్రాంత్య మండలి ఆంధ్రరత్న భవనం, విజయవాడలో స్థాపించబడింది. ఆప్టేగారు అధ్యక్షులు. పేజంద్రావు వీరరాఘవయ్య కార్యదర్శి. నేను కార్యకర్గసభ్యుడను. సత్యనారాయణగారు 'మెయిలు'లో విజయవాడ చేరుకున్నారు. కొంచెంసేపు విశ్రాంతి తీసుకొన్న పిమ్మట ఆంధ్రరత్న భవనంలో జరిగే హిందీ తరగతులను సమీక్షించారు హైదరాబాదు వెళ్లే బండికి టైముఅయింది. ఎర్రుపాలెం స్టేషనులో దిగాం. మాకొరకు ఎడ్లబండ్లు తయారుగావున్నాయి. వేసవి ఎండ ఓర్పువహించాం. వీరులపాడుచేరాం. గ్రామపెద్దలు భోజనం ఏర్పాటు చేశారు. అప్పటికే సూర్యదేవర అన్నపూర్ణమ్మ గారు కాంగ్రెసుతో పనిచేస్తున్నారు. దాగర్లమూడి వేంకట్రామయ్యగారు హిందీని బోధిస్తున్నారు- చాలమందికి నిజాం రాష్ట్రంలో బంధువులు వుండడంవలన వుర్దూ వచ్చును. పాటిబండ్ల వెంకటపతిగారు రాష్ట్రభాష చదివివున్నారు. సాయంత్రం మొగసాలలో మీటింగ

ఆప్టేగారి హిందీ ఉపన్యాసానికి నేను తెలుగుచేశాను. సత్యనారాయణగారి ఉపన్యాసానికి మేడింద్రావు వీరరాఘవయ్యగారు అనువదించారు. మిగిలినవారిలో కొందరు హిందీలో, కొందరు తెలుగులో ఉపన్యసించారు. చివరకు సత్యనారాయణగారు సమీక్ష చేస్తూ హిందీ మన రాష్ట్రభాష, జాతీయభాష. కొద్ది శ్రమతో నేర్చుకోగలరు. అని చెప్పి అందుకు వుదాహరణగా మమ్మలను చూపారు. తర్వాత

శ్రీ మేడింద్రావు వీరరాఘవయ్య గారు స్వాతంత్ర్య సమరయోధులు. వారికి క్షయవ్యాధి వచ్చింది. కృష్ణా జిల్లా హిందీ ప్రచారకమండలి తరపున రు 400/లు సహాయనిధిని పోగుచేశాం. సత్యనారాయణగారు తాంబరం శానిటోరియంలో వారిని చేర్పించి, సభ ద్వారా 400 రూపాయలు సహాయం అందించారు. అయితే వీరరాఘవయ్య గారు ఆ జబ్బుతోనే మృతిచెందారు. మేము వసూలు చేసిన నిధిని వీరరాఘవయ్యగారి కుటుంబానికి అందజేశాం.

(3) జంధ్యాల శివన్నశాస్త్రిగారిని పిలిపించి హిందీ ప్రచార సమాచార్ కు సహాయ సంపాదకులుగా నియమించారు. హృషీకేశశర్మగారు మరణించిన తర్వాత శివన్న శాస్త్రిగారు ప్రధాన సంపాదకు లయినారు. వారు రచించిన వ్యాకరణాన్ని స్వబోదినిని, శబ్దకోశమును సభ ముద్రించి శాస్త్రిగారికి కీర్తి ప్రతిష్ఠలు తెచ్చింది.

4) కేంద్రీయ సంస్థాన్ సత్యనారాయణగారి కృషి ఫలితమే.

5) హిందీ ప్రచార ప్రెస్సుకు ఆదినుంచి ముద్రణా ప్రపంచంలో విశిష్ట స్థానము రావటానికి కారకులు వారే.

6) స్వాతంత్ర్య పోరాట కాలంలో దక్షిణ భారత హిందీ సభా కార్యాలయం జాతీయ కాంగ్రెసుకు చర్చావేదికగా పనిచేసింది.

# మైదానం

హరిబాల

'లేచిపోయినా' నంటే ఎవరన్నా నన్ను, నాకెంతో కష్టంగా వుంటుంది. ఇదివరకంతా యీ మనుష్యుల్లోంచి, నీతివర్తనుల లోంచి వెళ్ళిపోయి, ఎడారిలో జీవించడం వల్ల నేను చేసిన పనిలోని ఘోరత్వం నీచత్వం బోధపడలేదు, ఆ జీవితమంతా సుందరమైన, దివ్యమైన స్వప్నం వలె, ఆ ఎడారి పుణ్యభూమివలె, నాజీవితంలో ఈశ్వరుడుకి నేనెత్తే మంగళహారతివలె తోచింది. ఇంటినీ, బంధువుల్నీ, భర్తనీ మరిపించగల అనుభవం ఎంత ఉన్నతమో నువ్వే ఆలోచించు...' 'అమీర్‌తో నీకో' ఇంకో మరో పతివ్రతకో స్నేహమే వుంటే, మీరూ లేచిపోయే ఉందురు. అతని ఆకర్షణని నిగ్రహించలేక...' అంటుంది చలం 'మైదానం' లోని రా॥

రచయితగా చలాన్ని ఆంధ్రులకి పరిచయం చేయనవసరంలేదు. స్త్రీ జీవితానికి సంఘం విధించిన కట్టుబాట్లని నిరసిస్తూ నిర్భయంగా ఎదిరించి రచనలు సాగించినవారు చలం. స్త్రీకి బానిసను చేసుకున్న పురుషస్వామ్యాన్ని, ఇంద్రియ లోలత్వంతో పతితుడైన మానవుడు ఆనందం ఆత్మనిష్ఠమని ఎరుగక వ్యభిచరించటాన్ని, ఆధ్యాత్మికత పేరిట సంఘంలో చలామణి అయ్యే పాశవిక నీతులను, సాంప్రదాయం పేర పేరూని సాగే సిద్ధాంతాల వ్యాప్తిని వ్యతిరేకించారాయన.

సంఘంలో వ్యక్తి మేధస్సును తొలుస్తున్న కామ ప్రలోభాలు తొలగించబడాలని, ఆకలి నిద్ర వంటి సహజ దైహికావసరాల్లో ఒకటైన కామాన్ని తుచ్ఛమని, పాపమని భావించి ప్రకృతి సహజమైన సంబంధాలను త్రోసిపుచ్చరాదని స్త్రీ పురుషులను (Educate) చేయవలసిన అవసరాన్ని గుర్తించి శాస్త్రీయమైన దృక్పథంతో రచన సాగించినవాడు చలం. సాంఘికదురాచారాలకు బలైన స్త్రీకి వ్యక్తిత్వాన్నిస్తూ, స్త్రీ బానిస బ్రతుకును ఆర్థిక దాస్యాన్ని నిరసిస్తూ, స్త్రీని అంతులేని అధికారానికి, అమానుషానికి లోబరిచే అశాస్త్రీయమైన వివాహ వ్యవస్థ వల్ల శాస్త్రీయమైన పరిజ్ఞానం కొరవడిన వ్యవస్థ సృష్టించే ప్రలోభాలకు బలైపోతున్న స్త్రీల మానసిక క్షోభను వివరిస్తూ—అసలు స్త్రీ ఈ విధంగా సాంఘిక ఆర్థికరంగాలలో వెనకబడి వుండటానికి గల కారణాలను వివేచించి చూపిన వారాయన. వ్యక్తిగా కుటుంబంలోనూ, సమాజంలోనూ స్త్రీకి గల స్థానం ఏమిటి? ఆ స్త్రీని ఇంటిని, భర్తని, పిల్లలను, భద్రతను, గౌరవాన్ని అన్నిటినీ త్యజించి పోగలిగే స్థితికి తీసుకురాగలగిన పరిస్థితులేమిటి? అని స్త్రీ సమస్యను గురించి, సమస్య మూల కారణాన్ని గురించి ఆలోచించిన చలం అన్వేషణా ఫలితమే ఈ మైదానం.

312, శ్రీ నివాస్, ఎక్సైజ్ కాలనీ, సుబేదారి, హన్మకొండ–506 001.

మైదానం నవలలో రాజేశ్వరి ఒక సాధారణ గృహిణి. అందరి లాగానే ఆమె తన భర్తతో, పిల్లలతో కలిసి కాలం గడుపుతూ వుంటుంది. ఆ రాజేశ్వరికి అమీర్‌తో పరిచయం ఏర్పడుతుంది. తనకు అమీర్ పట్ల గల ఆకర్షణని, తీవ్రకాంక్షని నిలవరించుకోలేని ఆమె తన భర్తని, పిల్లలను, సంఘగౌరవాన్ని త్యజించి మైదానానికి లేచి పోతుంది. అక్కడ ఆమె విశృంఖల జీవితాన్ని గడుపుతూ హాయిగా వుంటుంది. ఆమెకు బాహ్య ప్రపంచం నుండి అమీర్‌కి వార్తలను అందించడానికి వచ్చే మీరాతో పరిచయమూ, స్నేహమూ ఏర్పడుతవి. మీరాతో రాజేశ్వరి పెంచుకుంటున్న అనుబంధాన్ని అమీర్ సహించలేకపోతాడు. అమీర్ మీరాని చంపడానికి ప్రయత్నిస్తే రాజేశ్వరి సాధ్య పడనీదు. చివరకు కోపోద్రిక్తతతో అమీర్ తనని తానే చంపుకుంటాడు. ఆ హత్యానేరం తనపై వేసుకొనిన మీరాని పోలీసులు బందీగా తీసుకువెళ్తారు. అతనికి మరణశిక్ష విధించబడుతుంది. అమీర్, మీరాలను ఇద్దరనూ కోల్పోయిన రాజేశ్వరి కేవలంగా మిగిలి పోలీసులచే పూర్వ సమాజానికి మరలా అప్పగించబడుతుంది

ఈ నవలలోని పాత్రలను పాత్రల మనఃస్థితిని అర్థం చేసుకోవడానికి మనశ్శాస్త్ర విశ్లేషణమూ, రచనలోని అంతఃతత్త్వాన్ని అర్థం చేసుకోవడానికి ప్రతీకవాదమూ తోడ్పడుతుంది. వాస్తవికతను అధిగమించి భావ ప్రపంచమున చొచ్చుకొని పోవుటకై రచయిత చేసే ప్రయత్నమే ప్రతీక వాదము. భౌతికరూపమునకు లోపలనున్న తాత్త్విక రూపమును దర్శించిన రచయిత లేదా కవి తదనుగుణముగా ప్రతీకలలో ఆ దర్శన జన్యమగు భావానుభూతిని వ్యక్తీకరిస్తాడు. ప్రతీకవాద లక్ష్యము తత్త్వదర్శనము. నిరాకారములయిన/దమితములైన భావములను మేల్కొలుపుటయే దాని ప్రధాన ప్రయోజనము.

చలం 'మైదానం' అత్యంత ప్రతిభావంతంగా మలచిన ప్రతీకాత్మక రచనము. ఇందులోని రాజేశ్వరి మన సమాజంలోని స్త్రీకి ప్రతినిధి. అమీర్ జీవసంబంధియైన వాంఛాప్రవృత్తికీ మీరా ఆమె అహానికీ ప్రతీకలు. రచయిత తన ఈ నవలకు 'మైదానం' అని భావస్ఫోరకంగానే పేరిడినాడు. మైదాన్ అనిన ఉర్దూపదమునకు రణభూమి లేదా యుద్ధరంగము అనికూడా అర్థమున్నది. ఈ నవలలో ఇది రాజేశ్వరి అంతరంగానికి ప్రతీక. యుద్ధరంగమైన రాజేశ్వరి అంతరంగంలో యుద్ధానికి తలపడ్డ యోధులు అమీర్ — మీరాలు. అమీర్ రాజేశ్వరి జీవ సంబంధియైన వాంఛా ప్రవృత్తికి ప్రతీక కాగా మీరా ఆమె అహం. సుఖాపేక్షయే ధ్యేయమైన వాంఛాప్రవృత్తికీ — జాగృతి దశలోని వాస్తవికతా సూత్రానికి లొంగుబాటు చూపే అహానికీ మధ్య జరిగిన సంఘర్షణలో వాంఛ తనంత తాను చచ్చిపోగా అహాన్ని సాంఘిక సంబంధమైన కట్టుబాట్లు బంధనంలోకి తీసుకుంటాయి. వాంఛ చచ్చి అహం బందీ కాగా మిగిలిన రాజేశ్వరి కేవలంగా సమాజానికి అప్పగించబడుతుంది. అహానికి ప్రతీకగా మలచబడిన మీరా బంధించిన పోలీసు సమాజపు కట్టుబాట్లకి ప్రతీక. చచ్చిపోతున్న అమీర్‌కి వైద్యం చేయడానికై వచ్చి అప్పటికే అతడు మృతుడవగా చేసేదేమీ లేక నిలబడి పోయిన డాక్టర్ వ్యక్తిలోని వాంఛ చచ్చిపోతున్న సమయాన సత్వర సహాయం అందించలేకపోయినా, అహాన్ని బంధనాల్లోకి తీసుకోడానికి సహాయపడే మన ఈ వ్యవస్థను ఎత్తి చూపే పాత్ర.

స్త్రీ లోని సర్వ వాంఛల్ని, అనుభూతుల్ని సమాజపు కట్టుబాట్లు అణచివేస్తున్నాయని ప్రతీకాత్మకంగా తెలియచేస్తున్న రచన ఇది.

వాస్తవిక ప్రపంచంతో, పరిస్థితులతో వ్యక్తి అనుక్షణం రాజీపడవలసే వుంటుంది. ఆ విధంగా రాజీ పడలేని వ్యక్తి వాటిని తన ఇష్టాయిష్టాలకి అనుగుణంగా మార్చుకోవడానికి విఫలుడైతే వాంఛలను తీర్చుకోవడానికి తన అంతరంగాన్ని ఆశ్రయిస్తాడు. అక్కడ ఏ అడ్డంకీ లేకుండా తన స్వాప్నిక ప్రపంచంలో తాను యధేచ్ఛగా విహరిస్తాడు. తన ఆ మనోప్రపంచంలో తాను ధిక్కరించే వేటికి చోటివ్వడు — అమీర్‌తో మైదానానికి వెళ్ళిపోయిన రాజేశ్వరి యథేచ్ఛగా జీవనాన్ని గడుపుతూ వుంటుంది. తన మేనమామ అక్కడకి వచ్చినప్పుడు అంతకుపూర్వం తానతని అంశలకి లోబడే వుండినప్పటికీ, అతన్ని ధిక్కరించి, హేళనగా మాట్లాడి పంపించివేస్తుంది.— అయినప్పటికీ ఆవ్యక్తికి వాస్తవ ప్రపంచంలోకి రాక తప్పదు రాజీపడకా తప్పదు మళ్ళీ తన వాంఛలకూ కలలకూ బిగం బిగింపకా తప్పదు. ఈ అంతర్మధనంలో వ్యక్తి అనుక్షణం నలిగిపోతూనే వున్నాడు. వ్యక్తి మానసిక వికాసానికి సంఘర్షణలు ప్రధాన అవరోధాలనేది వాస్తవం.

చలం రచనల్లోని స్త్రీల పోకడలనూ, మనఃస్థితినీ అర్థం చేసుకోవడానికీ, ఆయన స్త్రీ పురుషుల లైంగిక సంబంధాల కంతటి ప్రాధాన్యం ఎందుకిచ్చారో తెలుసుకోవడానికీ మనోవైజ్ఞానిక శాస్త్ర సిద్ధాంతాల అవగాహన ఎంతో అవసరం. ఆ సిద్ధాంతాల ఊతతోనేగాని ఆయన రచించిన అధివాస్తవి రచనాధోరణుల్ని అర్థంచేసుకోలేము. ఈ అర్థం చేసుకోలేక పోవడంవల్లనే చలం చాలా అపార్థమైనారు.

వ్యక్తి ఆలోచనలకి, చర్యలకి, ఉద్వేగాలకీ అన్నిటికీ తగిన కారణాలుంటాయి. ఏ చర్యా అనాలోచితం కాదని చెప్పే మనోవైజ్ఞానిక శాస్త్రం మనిషి మానసిక సంఘర్షణలని, ఆ మనిషి అధోగతి పాలవటానికి దోహదం చేసే పరిస్థితులను గూర్చి తెలుసుకునేందుకు ఉపయోగపడుతుంది.

మనిషిలోని శారీరక, మానసిక స్థితిగతులకు గల సంబంధాన్ని శాస్త్రీయంగా విశ్లేషించిన మనశ్శాస్త్రవేత్త సిగ్మండ్ ఫ్రాయిడ్ మానవుని యే చర్యా అనాలోచితం కాదనీ, మనిషి మనస్తత్వంలో కలిగే మార్పులకు సాంఘిక విలువలే ప్రధాన అవరోధాలనీ విశ్లేషించినాడు వ్యక్తి లైంగిక సమస్యలకు మూల కారణాన్ని అన్వేషించి ప్రతిపాదించిన తన సిద్ధాంతాలలో 'లిబిడ్'కి అధిక ప్రాధాన్యాన్నిచ్చాడు.

ఫ్రాయిడ్ ప్రేరకాల 'ధ్రువీకరణ సిద్ధాంతం' ప్రకారం ది ఇగో అండ్ లిబిడో మోటివ్స్— మనస్సు ప్రారంభంలో అచేతనమైన అచిత్తుతో నిండి వుంటుంది. ఇది జీవ సంబంధి శక్తిమంతమైనది. దీనిలో సహజ దైహిక వాంఛలు, దమిత వాంఛలు వుంటాయి. సుఖాపేక్షయే ధ్యేయమయిన అచిత్తు ఆదిమభావాలు కలిగి వుండి కోరికల్ని వెల్లడి చేస్తూంటుంది. ఇందులో నుండి ఒక సవరణాంశంగా పుట్టేదే అహం. వ్యక్తి మనసులోనిదే అయినప్పటికీ ఇది సచేతనము. వ్యక్తితోనే గాక బాహ్య ప్రపంచంతో సంబంధమున్న భాగము. అచిత్తు కామేచ్ఛతో నిండి తక్షణ సుఖాలను ఆశిస్తూంటే ఆ కోరికలలో సమంజసంగా వున్న వాటిని తీర్చడానికి అహం ప్రయత్నిస్తుంది. నేను, నాది అనే భావాన్ని కలిగి వుండిన వ్యక్తి అచేతనంలోనూ, పగటి కలలలోనూ ఆనంద సూత్రాలను అనుసరించినా జాగృత దశలో వాస్త

కవితా సూత్రానికి బానిసగా చేసేది మనస్సులోని విమర్శనాత్మక భాగమైన అధ్యహం, ఇది సాంఘిక సాంస్కృతిక సంబంధి.

అమీర్ రాజేశ్వరితో పరిచయం అయిన దగ్గర నుండి మరణించేవరకు ఏమాత్రం ఆలస్యం చెయ్యనివ్వని సుఖాపేక్షతో మెలగడం, తన వాంఛకి అడ్డువస్తుందన్న భయంతో రాజేశ్వరి గర్భంలో రూపు దిద్దుకునే బిడ్డని సైతం అడ్డు తొలగించుకొమ్మని ఆంక్ష పెట్టడంవంటివి అమీర్ ద్వారానే పరిచయం కలిగిన మీరాతో రాజేశ్వరి అమీర్ పరోక్షంలో అనుబంధం పెంచుకోవడం, అతను అమీర్ చేతిలో దెబ్బతిన్నప్పుడు, అగాధంలోకి జారిపోతున్నప్పుడు అతనికై ఆరాటపడటం, మీరాని వదలుకోలేక పోవడం వంటి చిత్రణములు, అనంతర కథా చిత్రణము చలంపై ఫ్రాయిడ్ ప్రభావాన్ని స్పష్టపరుస్తూనే వున్నవి.

చలం మ్యూజింగ్స్‌లోని ఈ వాక్యాలు దీనిని కొంతవరకు ధ్రువపరుస్తూ ఉన్నాయి. తోటుగా, వెనకగా పరిశీలిస్తే ఒకటే సంగతి తేలుతుంది ఎవరికైనా. మనుషుల మనసులో వుండే ప్రోద్బలాలన్నీ తరచి చూడగా అంతా *Sex* ప్రోద్బలమని తేలింది ఫ్రాయిడ్‌కి. ఇంకా తర్వాత ఈ *Sex* ప్రోద్బలమూ అసలు జీవనానికంతా మూల సూత్రమూ ఒక్కటేనని కనుక్కుంటారు.

'స్త్రీలు అవినీతి మార్గాల సంచరించేందుకు ఉత్త కుందకావడంకాక, అనేక రహస్యమైన మోటివ్స్—అందులో కొన్ని చాలా ఉదారమైనవి వుంటాయని నేను ఎనలైజ్ చేసినందుకేగా సంఘం విరుచుకు పడ్డది నామీద' అంటారు చలం.

చలం తన రచనల్లో సృష్టించిన స్త్రీల పాత్రలను, మనఃస్థితిని అర్థం చేసుకోవడానికి, తాను స్త్రీ పురుషుల లైంగిక సంబంధాలకు అధిక ప్రాధాన్యం ఎందుకు ఇచ్చాడన్నది తెలుసుకోవడానికి మనోవైజ్ఞానిక శాస్త్రసిద్ధాంతాల అవగాహన మెంతో తోడ్పడుతుంది.

వ్యక్తి మానసిక ప్రవృత్తికీ ప్రవర్తనకీ అతీతమైన యథార్థాన్ని గ్రహించే ప్రయత్నంలో వస్త్వాశ్రయంగా సాగించిన ఆలోచనకి అన్వేషణకి అక్షర రూపకల్పన మీ 'మైదానం'.

# కవితావీథి

## రామబాణము

### నవమ సర్గము

ఊట్ల కొండయ్య

తొలికోడి కూసె ప్రత్యూషఘోషణమున
నిల మేలుకొనె కనుల్ నులిమికొనుచు
జృంభించి యెత్తిన చే దోయి దెంచి, సా
రించి, మైమఱచి నిద్రించుచున్న
పుణాగుల ముద్దు మోముల పేరు పేరున
ననుగు వ్రేళుల బట్టి పుణికి లేపె
ప్రార్థనా గీతముల్ పాడదొడగె, నని
కాక కంఠమ్మందు కలువకున్న
శ్రుతి గలుపవెయనుచు బతిమాలి బతిమాలి
కాయగాచె నోరు వాయసమ్మ!
యనెడి తల్లి జూచి యనె కాకి యిందొక
డైన కావు కావు మనగలండె? 1

నోరు బెట్టి బ్రదుక నేరిచినావని
నవ్వుచుండ జనని రివ్వున జని
వృక్షశాఖ నెక్కి యక్షయమ్ముగ శ్రుతి
సాధనమ్ము సేయసాగె నదియు 2

దాని వినిభషకమ్ము ఉద్దండ లీల
గొంతు లొక్కింత సవరించుకొనుచునాగె
నేను దూరాటపిన్ జనియించవచ్చు
గర్జనము విని దిక్కు మొగములు బెట్టి 3

మలి కోడి కూసినపుడు ప్ర
జలు మేనుల నిద్ర దులిపి చని రొండొరులన్
నిలుచుచు సాల యెదుట గుం
పులు కూడిరి చిత్తరువున బొమ్మల వోలెన్, 4

కనుల కపూర్వమై యెదట కన్పడు
దృశ్యము మేనులందరున్
కనులయి చూడ, ముందు చనగన్
చరణమ్ములు రాక, పోవకుం
డను మన సొప్ప తా విధి జడమ్మయి,
మంత్రము పెట్టినట్లు ల
జ్జనమెటులో కరమ్ములు వశమ్మున
దెచ్చె నమస్కరింపగన్. 5

కాటూరి కవితాపీఠం, కుత్బిగూడ, హైదరాబాదు—2

దినముఖ కర్మల దీరిచి
ముని స్థిరుడై ధ్యాన యోగమున నుండన్ మే
ల్కని వలగొని కూర్చుండిన
జనుల తోచె ప్రమథులందు శంకరుడు వలెన్. 6

అమ్మహనీయ దర్శన సుఖమ్మగు
కండ్లని మేషమౌటతో
నమ్మనుజుల్ దివౌకసులయట్లయి
రయ్యెడలం దొకింత వా
లమ్ము, నదృష్టవంతుల పరమ్ములుగాక
తొలంగునే యన
న్యమ్మగు భాగ్య మిచ్చు గడియల్
చిరపుణ్య చరిత్ర జన్యముల్ 7

అబ్ధి గర్భ తలమున ముత్యంపుశుక్తు
లల్ల నల్లన విప్పికొన్నట్లు ధ్యాన
వారినిధి మగ్నుడైన యా బ్రహ్మమయుని
కనులు తెరపిళ్ళు పడె శాంతి కాంతులీని. 8

కదలెన్ మహర్షి చూపర్ల
యెద పాలకడలి మంథ్యలేలాధరముల్
కదలినటు, లెదుటి జనమొక
యెదుటున సౌఖ్యన్ ప్రవేశ మొందె సభక్తిన్. 9

పదుమికి నేడు తత్తదుల వా
దరుదెంచెడి వేళయాయె నా
ప్పిదముగ స్వాగతమ్ము పలపెన్ పులుగుల్
భయ విహ్వలమ్ములై
యెదుగ దొడంగె నూత విరులొక్కట
పర్విడి సందు గొందులన్,
కదలెదనింక నే తడయ గాదు
సువిస్తర యాత్ర వెంబడిన్. 10

అనుచు గడప దాటు నమ్మౌని వెనువెంట
నూరె కదలుచున్న తీరు తోచె
పల్లెగనిమ జేర వచ్చు సరికి మౌని
యంఘ్రు లాగె వాడు నాగి రటనె.

వెనుదిరిగి వారిగని ముని
యినదేవుడు తూర్పు కొండ నెక్కుచు భువినె
ల్లను మందారమ్ములు చ
ల్లెను దోసిళ్ళ కంటిరేయని యడిగెన్. 12

వారచ్చెరువురుగన, నిక
పోరాదా? పొడు బెట్ట బూనితిరేనిన్
యూరటు దెండ వనీ సం
చార మొనర్తుమన మౌని, నవ్వు లొసంగెన్. 13

గ్రామణి మౌని యెట్టెదుట కావిడి
యంతకు మించు భాగ్యమిం
కేమి గ్రసింతు మేము వచియింపగదే,
యిదె యాజ్ఞ యైనచో
గ్రామమనంగనేల తమకమ్ములు
సర్వము పాడు బెట్టి న
క్షేమహితాత్మ! మీ యడుగులే గతి
మాకనుచున్ నమింపగన్.

మునివరు మోము కోకనదమున్ వలె
సుందర మందహాస సం
జననము తోడ పూయగ
ప్రసన్న మనోహర దృష్టి నా ప్రజన్
కనుగొని నాయనుంగు సుగుణ
వ్రతులార! గృహస్థులార! యెం
దును గన సత్కుటుంబగతితో
ప్రతి నిమ్మనికిన్ జగమ్మునన్.

అమ్మలునయ్యలున్ మరలు
దయ్యెడు మీకు శుభమ్ము లాదటన్
నెమ్మది పొందె, నిట్టగుచు నెయ్యము
లొప్పునె యెందు నీ ప్రకా
రమ్మగు సచ్చరిత్రము తిరమ్మగునేని
ధరాతలమ్మునం
దిమ్మనుజ ప్రపంచమున కేమి వలెన్
చననిండు, పొందనెన్. 16

అని ముందడుగిడి బిరబిర
చనుముని, నమ్మౌని వెంట జనునల్వురగ
న్గొనుచున్ నిల్చిరటనె త
జ్జను లక్షులకలరు పొదలు చాటగ్రదనుకన్,
అతుల విధి ప్రయుక్త విమలాయుధ
మట్టిడ బాసి మౌనియ
చ్చోటు, నటవిన్ కటాకటుల
యారొక యోజన దూరము మాత్రము
న్నటులు వచించు కొంట శ్రవణమ్ముల
జొన్పక నేగువాడునై. 18

చనుదారి కుడ్య మెగసెనె
యన నాయోగివరుడాగె, హస్తద్వితీయ
మ్మనుసరుల రక్షణమ్ముగ
వెను జాపుచు, తూలివారు వెనుదాకతనన్. 19

ముని వెన్క నా చతుష్టయ
మును భయమున నొదిగి కాంచె పులి యొకడు మృగ
మ్మను నోట గరచి యడ్డము
చనుచెలుకన్ పిల్లి పట్టి చను మాదిరిగన్. 20

తిరుగుచు వెన్కకు నమ్మని
వరు దళి ముఖుడగుచు వల్కె వారికి, కనుగొం
టిరె బెబ్బులి కనికరమున్
నరునకు సహనరునిపై నెనరు లేదుకదా ? 21

ఆ పలుకాడుదున్ మరలి యమ్ముని
మార్గము బట్టి పోవుదో
నాపగిదిన్. సగమ్ము తెరువాయె
నొకింత శ్రమమ్ము వాసి పో
నోపునటంచు సాంద్ర తరువొందు
గృహమ్మటులున్న వారికిన్
జూపుతరిన్ వినంబడె ధ్వనుల్
పద ఘట్టన నెండుటాకులన్. 22

ఆసన్న మర్మరధ్వని
కాసలతో నేక మగుచు బహుళముగుడు, సం
త్రాసమున నల్వురరయన్
హాసమ్మున నరసె మౌని యంతర్ముఖుడై. 23

కూరిచియుండ తపసి యా
పూరుషులట నాల్గు దిశల మోలెన్ చుట్టున్
జేరి యుపవిష్టులగు నెడ
బేరువగుచునగుచు రవము చెంతన్ జేరెన్. 24

కార్ముకములు, విచ్చుకత్తులు, గండ్ర గొ
డ్డళులు ధరించు చేతులను గూడి
భీషణాకృతులు, విభీషణా లోకన
ములతోడ నా శబ్దములు సమక్ష

మందున ప్రత్యక్షమగుడు వారలు మూగ
వోయి ప్రమాన్పడి కన్ను లప్పగించి
చూపులాడుపగాక చూడ యోగీశ్వరు
డాగతులన్ చేత స్వాగతించి
కూరుచుండు దనియు కోరె చేసన్నచే
నాయుధముల వార లవల బెట్టి
జతన మరసి కరముసాచి వద్దన, వారు
కూలబడిరి పిల్లి కూనలట్లు. 25

కను విరుపుల కార్యమ్మే
మని దేవనిభుండు మౌనియయుగ న మాంత
మ్మున వారు పదములంబడి
వనట కుమిలి కుమిలి యేడువందొడగిరి పో. 26

కన్నీట కాళ్లు కడుగుచు
నున్న మొరకు జనుల హాస్యయుగళి గురుండున్
వెన్ను నిమిరి యోదార్చెన్
మిన్నక తరుంతతలనుండి మిత్రుడు చూచెన్. 27

# ఆదివారం

కన్నడము

**డా॥ జి. యస్. శివరుద్రప్ప**

తెనుగు

**శంకరగంటి రంగాచార్యులు**

ఈ దినం ఆదివారం ...
ప్రవహించే ఏరు టక్కున ఆగి మడుగై
నా తీరంలో చెట్టూ, చేమా, తీగా, ప్రతిఫలించి
ఏమో తృప్తి,
అంత తొందరలేదు
ఉదయపు నిద్రకు మరికొంచెం పొడిగింపు
ప్రసాదించవచ్చు,
పెరిగిన గడ్డం ఇక రెండు మూడు గంటలు
వేచి యుండవచ్చు,

ఈ ఒక్క దినమైనా...
వచ్చిపోయే తొందరపాటు అడుగుల
పెరిగే క్యూతోకల,
పొర్లే చక్రాల
ఫోన్ల,
ఫైళ్ళ,
రగడ లేకుండేట్టు
ఉన్న చోటే వుండి
నేనే నేనుగా కావొచ్చు

ఈ నేను
పరానికి టికెట్టు తీసుకుని
ఇహపు వెయిటింగు రూములో

రైలు బండికోసం కాచుక్కూర్చోలేదు
నా ఉద్ధరణకు ఏ దేవునికీ లంచం ఇవ్వనవసరం
లేదు.

సాధ్యమైనంతవరకూ ఈ వీధుల మీద
నా చక్రాల్నిరుద్ది సమిసేటట్లు చేశాను.
ఈ ఒక్కదినం
ఆగిన చక్రాల కీళ్ల కొకింత నూనెవేస్తాను.

ఎంత సొగసుగా వుంది!
కిటికీ కవతల
నీలి నింగిలో పలుచగా తేలిపోయే ఆ మబ్బు!
క్రింద ఒకటే గుట్ట
గుట్ట మీద తల విరబోసుక నిలిచిన ఒకటేచెట్టు!
అన్నీ విశ్రాంతి తీసుకుంటున్నాయి
ఈ సెలవు రోజున!

ఇలాంటి ఆదివారపు ఒక క్షణాన్నే
శాశ్వతం చేసుకుని ఉండొచ్చేమో
స్థిత ప్రజ్ఞుల, సిద్ధుల మనస్సు!
అలా చూస్తే, ఈ ఒక్క క్షణం
నేను కూడా ఒక సిద్ధుడిని,
లేకుంటే—
ఒకింత తక్కువ రకపు బుద్ధుడిని!

రిటైర్డ్ హెడ్మాష్టర్, ఇంటి నెం. 6/685–ఏ, రాంనగర్, అనంతపురం-515 004.

# సబ్బు

కనపర్తి రామచంద్రాచార్యులు

కొవ్వొత్తిలాగే,
అగరొత్తిలాగే.
సబ్బు
స్వార్థ రహిత త్యాగమూర్తి !
అవగాహనవుంటే అర్థమౌతుంది
దాని జీవనస్ఫూర్తి:
మనదేహంతో
తన దేహాన్ని రాపిళ్ల పెట్టి,
మన కాలుష్య నివారణలో
తన బ్రతుకును పణంగా పెట్టి,
అరిగి అరిగి, కరిగి, నరిగి
మనిషి సేవలోనే అస్తిత్వాన్ని
ఎంత అరిగినా
నురగల నవ్వుల తరగలే!
ఎంత కరిగినా

మెత్తదనపు మేలి నునుపులే
అర్ధాంగితా—మృదువుగా
అంగాంగాన్ని నిమిరి
'అర్ధాంగి' అయిపోతుంది:
కానీ
ఆత్మశుద్ధిలేని మనుషులకు
'దేహశుద్ధి' చేస్తున్నందుకు....
నిరసనగా పుసికి పోతుంది;
పరుల సేవకై
ప్రాణాలు బలిపెట్టుకోవడంలో
అగరొత్తికి కొవ్వొత్తి అక్కైతే
సబ్బుబిళ్ళ చెల్లెలవుతుంది:
పవిత్ర స్నానమజ్జనంలో
ఒక సమిధగా కాలిపోయి
కవితా ప్రపంచంలో నిల్చిపోతుంది:

ఇంటి నెం. 7-3-66 పాతగంజువీధి, సిద్ధిపేట-502 103.

# ఎర్రతివాసీ

అడిగోపుల వెంకటరత్నం

అజ్ఞాత వాస మజిలీ
నన్ను నీ వాళ్ళో వదేసింది
ఉండేది మనమిద్దరమే...
పేగు తెగిన ప్రేమ
హద్దులేని అనురాగం మధ్య
గాలి
నిశీధి
గోడలు గమనిస్తున్నాయి!
మజిలీ వార్త మనల్ని దాటితే
పచ్చికాయనై రాల్తాను
ఉద్యమం ఎడారౌతుంది
ఒయాసిస్సు ఇంకి పోతుంది!
వీడ్కోలు తీసుకుంటున్నా...
స్వాగతం వీడ్కోలుకు
అమ్మ హృదయం
ఎప్పుడూ పరిచిన ఎర్రతివాసీ!

నాగార్జున యూనివర్శిటీ, గుంటూరు—522 510

# మందార మాల

## నరసింహ శతకము–సామాజిక విమర్శ

గుండి రామ్‌కుమార్

'భూషణ వికాస శ్రీ ధర్మపురినివాస ! దుష్టసంహార నరసింహ దురితదూర!' అను మకుటము గల 'నరసింహ శతకము' శేషప్ప అను కవిచే రచించబడినది. ఇతడు తెలంగాణా ప్రాంతమందలి కరీంనగరం జిల్లా జగిత్యాల తాలూకాలో వేదశాస్త్రములకు పుట్టినిల్లై కళలకు కాణాచిగా ప్రసిద్ధి చెందినట్టి గోదావరి తీరమున 'దక్షిణ కాశి' అనబడు 'ధర్మపురి' అను ప్రాచీన పుణ్యక్షేత్రమందు జన్మించెను.

శేషప్ప సాత్తాడు వైష్ణవుడు. చాలా పేద కుటుంబానికి చెందినవాడు. 'దాన ధర్మముల సద్గతిని జెందుదమన్న. ఘనముగా నాయొద్ద ధనములేదు.' (న–శ–9) అని అతడే చెప్పడము వలన ధనములేక దారిద్ర్య బాధ ననుభవించినట్లు తెలియుచున్నది. శేషప్ప గొప్ప భక్తుడే కాకుండా, మృదంగ వాద్యములో అతనికి ప్రత్యేకత కలదు. అట్టి తన కళను పొట్ట కూటి కొరకుకాని, ధనము కొరకు కాని వినియోగించక కేవలము ఈశ్వర భజన కొరకే అర్పించి తన భక్తిని చాటినాడు.

శేషప్ప కాలంనాటి సమాజంలో దగా, దౌర్జన్యం, దుర్భరదారిద్ర్యము, లోభత్వము, అహంకారము, అవినీతి, అక్రమాలు మొదలగునవి సమాజాన్ని పట్టి పీడించేవి. అట్టి సమాజంలో బ్రతికిన శేషప్ప కూడా వాటికి ప్రభావితుడై ఇటు పేదరిక జీవితమును అనుభవించలేక, అటు సమాజ పరిస్థితులకు తట్టుకోలేక పోయినాడు. దేవుని అనుగ్రహము చేత తనకు అబ్బిన సంఘమునందలి కుళ్ళును విమర్శిస్తూ నీతి నిజాయితీలను ప్రబోధించపూని పవిత్ర గోదావరిలో స్నానమాడి నరసింహస్వామి వారి ఆలయములోనికి ప్రవేశించినాడు. బరువెక్కిన గుండెతో కన్నీళ్ళు కాల్వలై పారగా, కవితా కన్య సమాజంలోని చెడును రూపుమాపడానికి శేషప్ప మనో గర్భమునుండి 'నరసింహ శతక' రూపంలో ప్రసవించినది.

'నరసింహ శతకమందు' 'కోతికి జలతారు కుళ్లాయి యేటికి' వంటి చమత్కార పద్యములే కాకుండా, ఎండిన ఊళ్లగో దెరింగింపదెవ్వడు! పండిన ఊళ్లకే ప్రభువులంత" మొదలగు కొరడా దెబ్బలాంటి పద్యాలవెనుక అతని విమర్శనా ధోరణులే భళున మెరుసాయి.

శేషప్ప రచన కొన్నిచోట్ల భగవంతునికి మొర పెట్టుకున్నట్లుగా ఉంటూ సమాజానికి హితబోధ నిస్తున్నట్లుగా ఉండును.

'గణ, యతి ప్రాసలక్షణము జూడగలేదు: పంచకావ్యలోక పఠనలేదు! ...

...నీ కటాక్షంబున నేరచించెదగాని! ప్రజ్ఞ నాయదిగాదు ప్రస్తుతింప! .... (న.శ 2) లోకంలో కొంతమంది పిల్లకవులు కొద్దో గొప్పో రచనచేసి తామె కవులమనే భ్రమలో పడతారు కాని ప్రతిభావంతులెప్పుడు ఎక్కువగా మాట్లాడరు అందుకే కాబోలు శేషప్ప తనకు శతక రచన చేసే ప్రతిభ ఉన్నప్పటికి తాను ఛందశ్శాస్త్రాది గ్రంథములను చదువలేదని, కేవలము దేవుని దయచేతనే రచన చేసితినని తన వినయమును ప్రదర్శించినాడు. ఈ విషయములో ఆదికవి నన్నయ కూడా తనను రాజరాజు భారత రచన చేయుమన్నప్పుడు 'దేవా విద్వజ్జనంబుల అనుగ్రహంబునం జేసి నా నేర్చు విధంబున నిక్కావ్యంబు రచించెద"అని వినయముతో పలికినాడు. నిజమునకు శేషప్పకు ఛందో నియమాల గురించి తెలువకుంటె ఆయన శతక రచన ఎట్లా చేసినాడు? ఆయన జేసినది కేవలం తెల్లకాగితం మీద నల్లగీత పెట్టడం కాదుకదా! భాషా సౌందర్యంతోపాటు, భావ గాంభీర్యతను మేళవించిన సీసపద్యము ఒయ్యారంగా నేటికి ప్రజల నాలుకలమీద నాట్యమాడుతున్నదంటె అది అతని పాండిత్య ప్రదర్శనకు విదర్శనము మరేమిటి? ఇట్లు శేషప్ప ఒక వంక తన వినయ సంపదను దేవుని యెదుట ప్రదర్శించినను, ఇంకొకవంక అల్ప విజ్ఞానము కలిగి పండితులమని విర్రవీగేవారికి గాయములేని పోలీసు లాఠీ దెబ్బల్లాగా కొట్టినట్లుగా ఉన్నది. ఈ పద్యములో శేషప్ప ఎంత పాండిత్య మున్నను వినయముతో మెలగవలెనన్న హితమును బోధించినాడు.

శేషప్ప కాలంనాటి సమాజంలో ధనమే జీవిత ధ్యేయంగా భావించే ధనవంతులకు ధనంతోపాటు మానవతను కలిగించడానికి ప్రత్యేకమైన ప్రబోధం చేశాడు. శేషప్ప ధనికుల దృక్పథాన్ని సరిదిద్దే ప్రయత్నం ఈ విధంగా చేశాడు.

> 'తల్లి గర్భము నుండి ధనము తేడెవ్వడు
> వెళ్ళి పోయెడినాడు వెంటరాదు' (న.శ 15)

సమాజంలో కొంతమంది ధనికులు తామె ధనికులమని, తమ ధనమును చూసి ఎదుటి వారు తమ ఆధీనంలో ఉంటారనే భ్రమతో సామాన్యుని మీద అధికారం చెలాయించడానికి ప్రయత్నిస్తారు. కాని అది వ్యర్థమైన ఆలోచన. ఎట్లనగా ఏ విధము గానైతే మత్తగజమును తామరతూటిచేత కట్టి వేయుటకు చేసిన ప్రయత్నము వ్యర్థమగునో అదేవిధముగా ధనికులు తమ మాటలచే ఎదుటి వారిని కట్టివేయుటకు చేసిన ప్రయత్నము అంతే నిష్ప్రయోజనము ఆ విధంగా ధనవంతులు ధనాంధకారంలో పడి మానవత్వపు విలువలను కోల్పోతున్నారు. కావున ధనవంతులు ధనము అశాశ్వతమని, పుట్టిననాడు తేలేదు, పోయేనాడు వెంటరాదు. మధ్యలో వచ్చిన సిరికోసం ఎందుకు భ్రమ పడాలి? అన్న ఆలోచన వారికి కలిగినట్లైతే ఎదుటివారిపట్ల సమైక్యతా భావం కలుగుతుంది. ఆ విధంగా ధనవంతులను ప్రభావితం చేసేశక్తి దేనికున్నది?. ధనికులను ప్రభావితం చేసేశక్తి ఆధ్యాత్మికమైన విలువలకు మాత్రమే ఉన్నది. అట్టి ఆధ్యాత్మిక దృష్టి అలవడినపుడు ధనవంతులకు ధనంతోపాటు మానవతకూడా వారిలో చోటు చేసుకుంటుంది. అందుకే శేషప్ప ఈ పద్యంలో సంప

దల అస్థిరత్వాన్ని తెలుపుతూ, ఆధ్యాత్మిక విలువలను అడ్డంపెట్టుకొని ఆ మార్గంలో ధనికుల దృక్పథము మీద ధ్వజమెత్తినాడు.

ధనమును దాచే వారిపట్ల శేషప్ప తనకు గల అభిప్రాయమును వెల్లడించినాడు.

పొందుగా మరుగైన భూమిలోపల బెట్టి
దాన ధర్మములేక దాచి దాచి
తుదకు దొంగలకిత్తురో దొరలకవునో
తేనెజుంటీగలియ్యవా తెరువరులకు'........
(న.శ. 15)

నిజముగా శేషప్పకు ధనం మీద అసూయ భావంలేదు 'పెట్టజాలకయేల భిక్షమెత్తించెదు" అని పొట్ట తిప్పలకై బిచ్చమెత్తుతూ పెక్కు దారిద్ర్య బాధలనుభవించిన అతనికి ధనానికి గల శక్తి ఏమిటో తెలుసు, కాని వినియోగము సత్కర్మ మార్గంలో సాగాలని ఆయన కోరుకున్నాడు. తాము తినక దాన ధర్మము చేయక ధనమును దాచి దాచి చివరకు దొంగలకిస్తారో, దొరలపాలు చేస్తారేమోనని శేషప్ప ఆవేదన పడినాడు అట్లు ధనం దాచి పెట్టే వారిని తేనె కూర్చి ఇతరులకిచ్చే తేనెటీగలతో పోల్చి పరిహసించాడు.

శేషప్ప కాలానికి దానగుణం చాలా వరకు తగ్గిపోయినది. దానము కొరకు వచ్చే అర్థిని వెళ్ళగొట్టే దాతృత్వ హీనులను ఇట్లు విమర్శించినాడు.

లోకమందెవడైన లోభిమానవుడున్న
భిక్షుకర్థికి జేతపెట్టలేడు'.......(న.శ.16)

పేదరిక బాధ లను భరించలేక కొంత మంది బిచ్చమెత్తడము కొరకు చాలా దేశములు తిరుగుతారు. కాని బిచ్చమెత్తడము అంత తేలికయైనది పనికాదు. బిచ్చంపెట్టు చల్లని తల్లులు కొందరుందరేమో కాని, లేదని వెళ్లగొట్టె లోభులే ఎక్కువగా కనబడతారు. లోభులు దానము చేయకపోయినను తగాదాలేదు. కాని చేసేవారి దగ్గరకు వెళ్ళి తమ ముల్లె పోయినట్లుగా చాడీలు చెప్పి దానము చేయకుండా కొందరు అడ్డు పడతారు. అందువలన నూటికో, కోటికో ఒకరాత ఉంటే లోభివాని ప్రభావంలో వాడు కూడా విసిగిపోతున్నాడు. అందుకే శేషప్ప 'తాను బెట్టకుండగనున్న లోపుపుట్టదు. కాని ఒరులు బెట్టక కాచియోర్వలేరు? ఇటువంటి క్రూరులను భిక్షకుల శత్రువులుగా భావించినాడు. ఒక్కొక్కసారి బిచ్చగాండ్రకు బిచ్చము దొరకక గద్దరింపులే ఎదురైనపుడు బిచ్చంపెట్టని వారిని తిట్టుకుంటూపోతారు. ఇది గ్రహించిన శేషప్ప 'అడిలోభుడును భిక్షకుడుగ బోసుటరోత?' (న.శ.62) అని లోభులమీద అసూయ పడినాడు కావున ఎవరైనా విడిచి దాతృత్వం గుణ అలవరచుకున్నప్పుడే సమాజంలో గుర్తింపు ఏర్పడుతుందన్న నగ్నసత్యమును ఈ పద్యముద్వారా చాటినాడు శేషప్ప.

కుటుంబములో పిల్లలు చెడు ప్రవర్తన కలిగిన వారైనచో ఆబాధ్యత తల్లితండ్రులదేనని శేషప్ప ఇట్లనినాడు.

...'తనయుండు దుష్టుండైన తండ్రితప్పు!—కూతురు
... ...(న.శ. 12)

ఏ తల్లితండ్రులైననూ తమ బిడ్డలను మంచి మార్గములో ఉంచుటకు శ్రద్ధతీసుకోవాలి. ఒకవేళ ఎప్పుడైనా సంస్కారము తప్పి ప్రవర్తించినట్లైతే వెంటనే మందలించాలి. ఐతే పిల్లలను మందలించడానికి ముందు తల్లిదండ్రులు చక్కని ప్రవర్తన కలిగి ఉండాలి. లేకుంటే పిల్లలు తమ మాట వినడము అటుంచి ఎదురుతిరిగే ప్రమాద

మున్నది ఆరకంగా పిల్లలు ఎదురు తిరగడానికి తల్లితండ్రులే తప్పు చేసినవారవుచున్నారు. అంతేకాదు కొడుకు దుర్మార్గుడైతే కుటుంబమునకు అపకీర్తి ఎట్లు వచ్చునో ఈ క్రింది శ్లోకము ద్వారా తెలియుచున్నది. 'శుష్కేణైకేనవృక్షేణ వనం పుష్పిత పాదపం। కులందారిత్ర హేనేం పురుషేన్వేనదహ్యతే' (పంచరాత్రము 1–12) ఏవిధముగానైతే వచ్చని వనములో ఒక ఎండిన చెట్టుఉండి దానికి నిప్పు అంటినపుడు వనమంతయు దహించిపోవునో ఆదే విధముగా కుటుంబములో కొడుకు దుర్మార్గుడైతే వాడివల్ల వచ్చే అపకీర్తి వాడికేకాక తల్లితండ్రులు మరియు కుటుంబమే అపకీర్తి పాలవుతుంది కావున పిల్లలను మంచి మార్గములో నడిపిస్తూ, కుటుంబ గౌరవాన్ని రక్షించే బాధ్యత తల్లితండ్రులది. పద్యము పిల్లల పట్ల బాధ్యతలేని తల్లితండ్రులను ఈ హెచ్చరించినట్లుగా ఉన్నది

సంఘమునందలి కుళ్ళునేరి తీక్షణముగా విమర్శించుటలో వేమనది అందెవేసిన చేయి. శేషప్పయు కొన్నిచోట్ల వేమననునసరించి సమాజం కుళ్లును అద్దము పట్టినట్లుగా చూపినాడు,

'అధికవిద్యావంతు ప్రయోజకులైరి। పూర్ణ కుంతలు సభాపూజ్యులైరి'।...(న.శ.21)
'విద్వాన్ సర్వత్ర పూజ్యతే' విద్వాంసుడు ఎక్కడైనను పూజింపబడతాడు. అన్నసూక్తి ప్రకారం విద్యావంతులు ఎక్కడైనను పూజింపబడాలి. కాని శేషప్ప కాలంనాటి సమాజంలో ఎంతో పరిశ్రమ చేసి పాండిత్యమును సంపాదించిన విద్యావంతులకు సరియైన గౌరవము. గుర్తింపు లేక నిర్లక్ష్యము చేయబడుతున్నారని కవి తన ఆవేదనను వ్యక్తం చేసినాడు. శేషప్ప పైవిధముగా చెప్పినట్లు నేటి సమాజ పరిస్థితి కూడా అదే విధముగా ఉన్న దనుటలో అతిశయోక్తిలేదు. ఎందుకంటే నేటి సమాజంలోని విద్యావంతులు కూడా ఉన్నస్థానములో ఉండ తగినవృత్తికి, సరియైన గుర్తింపు అవకాశము లేక వివిధ కారణాల చేత మరుమూల గ్రామాలలో మరుగునపడి అప్రయోజకులవుతున్నారు. మరి విద్యావంతులే అప్రయోజకులైనపుడు విద్యను నేర్చుకోవడానికి భావితరాల వారికి ఆలోచించవలసిన పరిస్థితి ఏర్పడుతుంది. కాబట్టి విద్యావంతులు ఎక్కడైనను ప్రయోజకులుగా గుర్తింపబడాలి. గౌరవించబడాలి. అప్పుడే సమాజంలో విద్యా ప్రమాణాలు మెరుగు పడడానికి వీలవుతుంది. ఈ పద్యంలో శేషప్ప విద్యాధికుల పట్ల సానుభూతి ప్రకటించుచు, సమకాలీన సమాజంలోని పూర్ణకుంతల మీద తిరుగుబాటు చేసినాడు.

శేషప్ప సమాజంలోని కుళ్లును ఎత్తిచూపడమే కాకుండా ఆ సమాజంలోని నరసింహదేవుని కూడా విడచిపెట్టక, తన దారిద్ర్య బాధలను నివారించి, రక్షించమని దేవున్ని వ్యాజస్తుతి రూపంలో ఇట్లనినాడు.

మనము దేవున్ని నమ్ముకున్నప్పుడు కష్టాలు ఎదురైతే నీవు మాకేంచేశావు? మమ్ములను కాపాడవలసిన బాధ్యత నీదేనని దేవున్ని ఎత్తి పొడుస్తూ, మొరపెట్టుకుంటాము. శేషప్ప కూడా దేవున్ని నమ్ముకున్నాడు కాబట్టి ఉదరపోషణకై యొకరి నాశ్రిపక నేరనాకన్నంబు నీకు నడుపు.........
(న.శ. 46) అని అన్నవస్త్రాలిచ్చి అదుకొమ్మని శ్రీకాంతుని వేడుకున్నాడే కాని ఐశ్వర్యములను అడుగలేదు. అప్పటికి నరసింహ ప్రభువుకు అతనిపై కరుణ కలుగలేదు. ఇక సహించి ప్రయోజనం లేదనుకొని 'పెట్టలేనంటివా పిన్న పెద్దలలోన దగవుకిప్పుడు డీయ తలచినాను...

అంటూ దేవున్నే తగవుకు ఈడ్చే పరిస్థితికి వచ్చాడు భక్తులను పోషించు బాధ్యత దేవునిది కావున తనను పోషించుటకు ధనము భారమైనచో తలకిరీటము, కుండలములు పైడిగొలుసు లమ్ముమన్నాడు. నిజమే మనకేదైనా సమస్య ఎదురైనప్పుడు విలువగల వస్తువులను తాకట్టు పెట్టైనా ఆపరిస్థితి నుండి బయట పడతాడు. శేషప్ప పరిస్థితి కూడా అందు: 'కొసకు నీ శంఖ చక్రముల్ కుదువబెట్టి గ్రాము కొసంగి పోషించు (న. శ. 46) మని దేవున్నే నిలదీసినాడు. 'దేవుడు కూడా భక్తుల కోర్కెలు తీర్చడానికి భయపడి ఒక్కొక్కసారి పారి పోతాడేమో అందుకే శేషప్ప అందరేమైన నిన్నడుగవచ్చెద రంచు క్షీరసాగరమందు జేరితాను'. .. .. (న శ. 40) అని దేవున్ని వెక్కసములాడినాడు ఈ పద్యములో శేషప్ప త్రికరణ శుద్ధిగా భగవంతుని నమ్మి ఆ మార్గంలోనే నరసింహ ప్రభువు యొక్క బాధ్యతను గుర్తు చేసి. వ్యాజస్తుతిలో దేవున్నే విమర్శించిన ఆయన విమర్శనా ధోరణి ప్రశంసించదగినది.

ఇట్లు 'దుష్టసంహార నరసింహ దురిత దూర' అను మకుటమనెడి ఆయుధమును చేతబట్టి సమాజంలోని కెడును రూపుమాపినాడు. ఆయన చెప్పిన ప్రతి విషయము సమకాలీన సమాజానికి సంబంధించినప్పటికి అది సార్వకాలికమైనది.

పార్ట్‌టైం లెక్చరర్ తెలుగు విభాగము
ప్రభుత్వ డిగ్రీకాళాశాల
నిర్మల్. జిల్లా ఆదిలాబాద్

# గాంధేయ మార్గంలో నేడు రాజకీయ వ్యవస్థ సాధ్యమా?

ఇది మనముందున్న గడ్డు సమస్య. మన మేధావులు నాయకులు యీ సమస్య పరిష్కారంతో తలమునకలై విభిన్న ధోరణులను వెల్లడిస్తుతున్నారు. అందువలన మొట్టమొదటగా రాజకీయ వ్యవస్థను గురించి గాంధీజీ చెప్పిన అభిప్రాయాన్ని తెలుసుకొందాం—'నీతి, నియమాలు లేని రాజకీయం మహాపాపం. అది సప్తమహా పాతకాలలో ఒకటి అవుతుంది.' —గాం

ఇప్పుడు ఆయన నడిపిన నైతిక విలువలతో రాజకీయ పోరాటాలను సాగి పశీలించుదాము.

గాంధీజీ నెలకొల్పిన నైతిక విలువలేపాటి? ఆయన రాజకీయ పోరాటానికి వుపయోగించిన ఆయుధాలు ఏమిటి? నేడు ప్రపంచశాంతికి గాంధేయ మార్గమొక్కటే అని ఎందుకు అనుకొంటున్నారు?

ఆయన స్థాపించిన నైతికవిలువలు అనుకున్నదాన్ని చెప్పడం, చెప్పినదాన్ని ఆచరించడం. దానినే సంస్కృతములో మనసా, వాచా, కర్మణా సమన్వయము అంటారు, తోటి మానవుని ప్రేమించడం, గౌరవించడం. బాధలతో వున్నవారిని ఆదుకోవడం, మానవధర్మం. మానవుని మానవునిగా గౌరవించే మానవత్వం కావాలి. అప్పుడే సౌభ్రాతృత్వము. సామరస్యము, శాంతి వర్ధిల్లుతాయి. మానవునిలోని చెడు ప్రవృత్తిని లేక పాలనా వ్యవస్థలోని పాశవిక విధానాన్ని అడ్డుకోవడానికి అక్రమాలను ఎదిరించడానికి చెడును

తొలగించడానికి ఆయన అవలంబించిన ఆయుధములు సత్యము, అహింస,/ రాజకీయ పోరాటములో ఆయన సాగించిన పోరాట విధానాన్ని సత్యాగ్రహం అన్నారు అనగా సత్యము కొరకు పీడని పట్టు ప్రాణము పోయినా ఫర్వాలేదు, కాని సత్యమును వీడరాదు. దీనికే మరి యొక పేరు అహింసాయుత పోరాటము. ఈ పోరాటంలో పాల్గొనే వ్యక్తి ధైర్యము, సాహసము, ఆత్మశక్తి కలిగి వుండాలి. ధర్మము కొరకు పోరాడుతున్నాను అను విశ్వాసం, జీవితాన్ని అర్పించుచున్నాను అను నమ్మకము కల్గియుండాలి. మనము సాధించ వలసిన లక్ష్యము ఎంత వున్నతమైనదో, పవిత్రమైనదో అంతటి ఉన్నతమైన, పవిత్రమైన సాధనను లక్ష్యసిద్ధికి ఉపయోగించాలి. భారత ప్రజలకు స్వాతంత్ర్య సముపార్జన సర్వోత్తమ లక్ష్యము. అట్టి పరమ లక్ష్యమును సాధించుటకు సత్యాగ్రహం ఒక్కటే లోకోత్తరమైనది

గాంధీజీ సత్యాగ్రహ విధానం వలన ఒక వైపు త్యాగాన్ని పెంచారు మరి యొక్కవైపు నిర్మాణ కార్యక్రమము ద్వారా నైతిక శక్తిని పెంచారు. టెర్రరిజం నైతిక పతనానికి మూలం. సత్యాగ్రహానికి పూర్తిగా విరుద్ధం. అందు వల్లనే గాంధీజీ కాంగ్రెస్‌లో ప్రవేశించి ఈ పోరాట పద్ధతిని అవలంబించగానే మనదేశంలో విప్లవవాదం ఆగిపోయింది. నైతిక విలువలకు గుర్తింపు వచ్చింది. హింసా యుత మార్గము శక్తిని, సంపదను వృథా చేస్తుంది. ఈనాడు వివిధ దేశాలు అణ్వాయుధాలు సమకూర్చుకొనేందుకు పిచ్చి పట్టినట్లు ప్రయత్నిస్తున్నవి. ఈ తరుణంలో విశ్వమానవులకు ఒకే ఒక కాంతి పుంజము కనబడింది. వ్యక్తికిగాని, ప్రభుత్వానికి గాని శాంతి, అహింసలే శరణ్యములు. సోదర భావాన్ని పెంపొందించడానికి దృఢ సంకల్పంతో పాటు ధైర్య సాహసాలు కావాలి. గాంధీజీ ఈ విజయాలను సాధించడంలో విజయులయ్యారని, సరిహద్దు గాంధీ శత జయంతి ఉత్సవాల్లో చెప్పారు. 1945 ఆగస్టు 6వ తేదీన హిరోషిమా మీద వేసిన అటంబాంబు వలన లక్ష మంది చని పోయారు. ఇప్పటి అణ్వస్త్రాలు వెయ్యి కోట్ల మందిని మట్టు పెట్టగలవు ఈ నెల 23వ తేదీ దినపత్రికల్లో రాబోవు లేజర్ అణ్వస్త్ర ప్రభావం మరింత భయంకరంగా వుంటుందని తెలియ పర్చింది. దాని యొక్క ప్రభావం 'రణము లేని మరణము. ఆయుధాలు చేపట్టి యుద్ధానికి బయలు దేరుతారు. ఇప్పటి ఆయుధాలు పురాణములలో చెప్పబడిన సమ్మోహన గారుడ. బ్రహ్మాస్త్రముల వంటివి అందుకనే అణ్వస్త్రాల నిషేధము కొరకు అగ్ర రాజ్యాలు కూడా ప్రయత్నిస్తున్నాయి. వాటి నిర్మాణం కొరకు ఖర్చు పెట్టే కోట్లా రూపాయలు మానవ కల్యాణము కొరకు వినియోగిస్తే దారిద్ర్య రేఖకు దిగువనవున్న మానవాళికి ముక్తి కలుగుతుంది ఇటీవల రిచర్డ్ ఎటన్‌బరో గాంధీజీ జీవితాన్ని సినిమాగా తీశాడు. అది అనేక దేశాల్లో ప్రదర్శించబడింది. పాశ్చాత్య దేశాలలో కూడా గాంధీజీ చూపిన బాట అనగా అహింసా మార్గము ప్రస్తుతం అతి కష్టాలలో యున్న ప్రపంచానికి వెలుగు బాట అని, మానవతా మనుగడకు శ్రీరామరక్ష అని విశ్వశాంతికి తోడ్పడే ఏకైక మార్గమని సినిమా వారిలో విశ్వాసాన్ని కలిగించింది.

మన దేశ రాజకీయ స్వాతంత్ర్య పోరాటాలను గాంధీజీయే నడిపించారు. భారత దేశం స్వతంత్రము పొందింది. కాంగ్రెస్ ప్రభుత్వం ప్రజలకు రాజకీయంగా సమాన అవకాశాలు కల్గించింది. ఆర్థికంగా ప్రజలు బలపడేటట్లు, దేశ

ప్రగతికి, ప్రజల సంక్షేమానికి కృషి జరగవలసి యున్నది. గాంధీజీ ఆశించినట్లు ప్రతి వారికి కనీస అవసరాలు తీరే విధంగా సంపూర్ణ స్వరాజ్యం రావలసి వుంది. ఈ పనిని సాధించడానికి మన దేశంలో కాంగ్రెస్ తప్ప బలమైన రాజకీయ పక్షము మరియొకటి లేదు. గాంధీ గారు తాను బ్రతి కుండగానే సర్వోదయ సమాజ స్థాపనకు కాంగ్రెస్ సంస్థను రద్దు చేయ మన్నారు. ఆయన చనిపోయిన తర్వాత అధికారంలోకి వచ్చిన కాంగ్రెసు వాదుల్లో పెరిగిన స్వార్థము, పెరుగు తున్న అవినీతిని, అనుభవిస్తున్న ఆడంబరజీవితాన్ని చూచి గాంధీగారి సూచనను పురస్కరించుకొని తర్జన భర్జనలు జరిగాయి. కాంగ్రెసు సంస్థను రద్దుచేస్తే దేశాన్ని సమైక్యంగా నడిపించ గల శక్తిగల వేరే పార్టీలులేవు. చిన్న చిన్న పార్టీ లతో ప్రాంతీయ తత్వాలు పెరిగి దేశసమైక్యతకు ముప్పు గలిగే ప్రమాదము కనబడుతున్నది. అనేక త్యాగాల ఫలితంగా సంపాదించుకొన్న స్వాతంత్ర్యాన్ని పరిరక్షించుకొనే ఉద్దేశ్యంతో కాంగ్రెస్ సంస్థ గాంధీజీ సూచన మేరకు రద్దు చేయబడలేదు. తర్వాత చరిత్ర కాంగ్రెస్ ఉండటమే దేశానికి మేలు, అని స్పష్టంచేసింది.

అయితే స్వాతంత్ర్య పోరాటాన్ని నడిపిన కాంగ్రెస్ సంస్థ కాలక్రమేణా నైతిక శక్తిని కోల్పోతూ వస్తోంది. బాధ్యతా రహిత ప్రవర్తన ఆడంబర జీవిత విధానము, పరస్పర ఆరోపణలు, ఆశ్రిత పక్షపాతము పెరిగినవి. తప్పులను ఖండించడము, లేక సరిదిద్దే పద్ధతులు తరిగి స్వార్థం పెరిగి అవినీతికి పాల్పడటం జరుగుతూ వుంది. ఇక సమాజాన్ని చూస్తే నైతిక విలువలు క్షీణించిపోయాయి. తీవ్రవాదం పెచ్చరిల్లింది. ప్రతి పార్టీలోను ఈ లక్షణాలు కనబడుతున్నాయి. అందుకనే గాంధేయ మార్గం వైపు దేశములోను విదేశములోను దృష్టి మరలింది.

మండలి. వెంకటకృష్ణారావు అవనిగడ్డ. కృష్ణాజిల్లా

# కథావీథి

## ఏది నిజం???

హిందీ మూలం
**డా॥ సరోజ త్రిపాఠి**

తెలుగు అనువాదం
**శ్రీమతి పారనంది నిర్మల**

సూటు, బూటు వేసుకొని మిస్టర్ ఎన్ శంకర్ తన యింట్లోనే కుర్చీలో కూర్చుని 'ఆఫీసర్‌హోదా'తో ఉన్నట్టు కనిపిస్తున్నారు. తనవైపే వస్తూన్న మిసెస్ శైలకుమారిని చూసి 'హలో డార్లింగ్' అని పలుకరించి సోఫాలో కూర్చోమని సైగ చేసేరు. ఎస్. శంకర్ దగ్గర కూర్చోగానే ఆమెలో ఎన్నో వారాలబట్టి బయలుదేరిన సందేహం రెక్కలు రెపరెపలాడిస్తూన్న పిచికలా బయటకొచ్చి గెంతులేయసాగింది. 'ఇంగ్లీషుభాషపై అసాధారణమైన అధికారం కలిగిన స్వామీ! హిందీ సప్తాహాల సమయంలో హిందీలోనే సంతకాలు చేయటమే కాక హిందీ వాడుకపై బ్రహ్మాండమైన ఉపన్యాసాలిచ్చే హే ఆఫీసర్ శిరోమణీ! నిజంగానే మీరు నన్ను 'డార్లింగ్'గా భావిస్తే, నాఒక్క గానొక సందేహాన్ని తొలగించండి. నాసందేహం "హిందీ" గురించే దయానంద సరస్వతి నుండి గాంధీ మహాత్ముడి వరకు, కేశవ చంద్రనుండి సుభాష్ చంద్రబోస్ వరకు ఏ హిందీని సమర్థించారో ఆ హిందీని మీరు కూడా సమర్థించి స్టేజెక్కి ఉపన్యాసాలిస్తారు. ఆ హిందీని నిజజీవితంలో ఎందుకు వాడరు? మీరెందుకు పిల్లలతో కూడ యింట్లో ఇంగ్లీషులోనే మాట్లాడుతారు? స్వామీ! మన పిల్లలేకాదు, కాలనీలో వుండే మొత్తం పిల్లలందరూ ఇంగ్లీషు స్కూళ్ళలోనే చదువుతున్నారు. హిందీ మీడియం స్కూళ్లకు వెళ్ళే వాళ్ళనెంతో చిన్నచూపు చూస్తున్నారు. హే శంకర్ గారూ! నేను పుట్టింటికి వెళ్ళినప్పుడు అక్కడ కూడ కాన్వెంట్ స్కూళ్ళే కళకళలాడుతూ కనిపించేవి, గవర్నమెంటు స్కూళ్ళు కళావిహీనంగా పాలిపోయి వున్నాయి. హే అంతర్యామీ! నేనన్నిచోట్ల ఇంగ్లీషు గొప్పే చూశాను. స్వయంగా మీరు కూడ మీ నిజ జీవితంలో ప్రతినిమిషం ఇంగ్లీషే జపిస్తూయుంటారు గాని హే నాథా! మీరు తమ సాంఘిక జీవితంలో వేదిక లెక్కి హిందీనే స్తుతిస్తూ స్తోత్రం చదువుతూంటారు. పత్రికల్లో ఇంగ్లీషుకి వ్యతిరేకంగా వ్యాసాలు రాస్తూంటారు. 'ఇంగ్లీషు'ని వ్యతిరేకిస్తూ నిప్పులు కురిపించే మీవ్యాసాలని చదివితే శరీరం గగుర్పొడుస్తుంది.

హే ఆర్యపుత్ర! ఇటువంటి విరోధాత్మకమైన మీ ప్రవర్తనని చూసి నేను సందేహిస్తుంటాను. హే

సి/104, బి. హెచ్. పి. వి. టౌన్‌షిప్, విశాఖపట్టణం–12.

సర్వజ్ఞస్వామీ! ఈ ద్విపాత్రాభినయంలో వున్న రహస్యాన్ని కాస్త వివరిస్తారా! హే ప్రభు! దయ చేసి మీ స్టైల్ దాని, అదే మీ 'డార్లింగ్' భ్రమని తొంగిస్తారా! ప్రభు! ఎస్. కుమారి ప్రశ్నలని అడిగి సమాధానం కోసం ఆశతో ఎస్. శంకర్ పెదవుల మధ్యనున్న సిగరెట్ పైపుని చూడ సాగింది. మిస్టర్ శంకర్ సిగరెట్ పొగను మిసెస్ ఎస్.కుమారి అమాయకత్వం పై ఊదుతూ ఆనందించారు. అతడు నవ్వుతూ అన్నాడు— "మంచిది, సరైన సమయంలోనే నీవు ఇటువంటి క్లిష్టమైన ప్రశ్న వేసేవుగాని 'దిపాత్రాభినయం' అనే పదం నాకు నచ్చలేదు. తెలివి తక్కువవారే ఇటువంటి పదం వాడుతారు. మంచి సొసైటీలో వున్నవారు ఇలా మాట్లాడరు. రాజకీయాలలో పటుత్వం, కుటిలనీతి తెలియని వారే ఇలా అంటూ వుంటారు. ప్రియే! నువ్వు దేన్నైతే 'ద్విపాత్రాభినయం' అన్నావో అదే పద్ధతి ఇండియా మొత్తంలో వాడుకలో వుంది. ఇదే ఆధునికత. 'మోడర్నిటీకి' గుర్తు ఇదే లౌక్యం. చెయ్యదల్చుకున్న పని గురించి చెప్పనవసరం ఏముంది. ఏ పనైతే చెయ్యమో, దాని గురించే ఎక్కువ ప్రచారం చెయ్యాలి దాని గురించే హామీలివ్వాలి మనదేశ ప్రజలకి చేతులెత్తి దండం పెట్టాలి. వీరిని తర తరాలుగా నమ్మించి నాట్యం చేయించవచ్చు. అందువల్ల నేను చెబుతున్నాను, విను. నీవు కలవర పడనక్కర్లేదు. భ్రమ పడటం వ్యర్థం. మేము ఉద్యమం చేపట్టం మనపని ఉద్యమం పైని వ్యాసం వ్రాయడమే.

హే డార్లింగ్! భారతదేశ 'భాషాతత్వం' లోనున్న గూడార్థం తెలుసుకోలేని సామాన్య ప్రజలు ఈ విధంగానే భ్రాంతిలో చిక్కుకు పోతారు. హే ఎస్. కుమారీ! ఎలాగైతే ఆధ్యాత్మిక జ్ఞానంతో సంబంధించిన నిగూఢ రహస్యాలని కేవలం పుస్తకాలు చదివి తెలుసుకోలేమో, సమర్థవంతమైన గురువుల ద్వారా తెలుసుకొని సిద్ధిని పొందగలమో అలాగే మనదేశంలో నున్న భాషాతత్వాన్ని, జాతీయ భాషా విధానం, లేక దాని మార్పులు, చట్టాలు లేక నాయకులు/అధికారులిచ్చిన ఉపన్యాసాల వలన అర్థం చేసుకోలేము. మామూలుగా వీటిని విని అందరూ అర్థం చేసుకోలేరు. మా బోటికొద్ది అధికారులే వీటిలోనున్న గూఢార్థాలని అర్థం చేసుకోగలరు. వైశేష మటియాని లాంటి వారు ఈ గూఢార్థాలని వెల్లడించడానికి పూనుకున్నారు. దీన్ని అర్థం చేసుకోవటానికి మావంటి పవర్‌ఫుల్ (బలమైన) ఆఫీసర్ కమ్ గురువుని చేరుకోవాలి. ఈ వేళ నీలో ఈ రహస్యాన్ని తెలుసుకోవాలని అనిపించింది గనుక నేను కూడ నీవంటి మనిషి ఎదుట అన్ని రహస్యాలనూ వివరించడానికి సిద్ధంగా వున్నాను. హే ప్రాణేశ్వరి! ఈ "భాషాతత్వం" (లేంగువేజ్ పోలసీ) ప్రప్రథమముగా నెహ్రూగారి మనసులో ప్రస్ఫుటించింది, రాజాజీ సునీతిగారు కొంతమంది తమిళ కార్యకర్తలవల్ల కూడ యిది సల్లపించి ది. కాని తరువాత ఈ నీతి (పోలసీ) దినదిన అభివృద్ధి చెందుతూ రాజీవ్‌గాంధీ కాలంలో పరాకాష్టకు చేరింది. పి. వి. సింహా. మహారాజు కూడ రాగమే ఆలపిస్తున్నారు. హే ఎస్. కుమారి! ఈ విచిత్ర మైన రహస్యాన్ని సామాన్యులు తెలుసు కోలేరు. సామాన్యులైతే దిన పత్రికలలో దేశనాయకుల ఉపన్యాసాలు. బాల కవుల భావాలు చదివి హిందీని నిజాతీయ భాష రూపంలో దిద్దడానికి ఏవైనా లోటు పాటులు వుంటే అవి కొద్ది కాలంతో పూర్తై పోతున్నాయనే అనుకుంటారు. ఈ రహస్యం కేవలం కొంత మంది దేశ నాయకులు అధికారులకే తెలుసు. ఒక అధికారి మరో అధికారికి నెమ్మదిగా రహస్యాన్ని చేరుస్తాడు. నీవు కూడ ఒక బాధ్యత గల అధికారి భార్యవు గనుక ఈ

రహస్యాన్ని తెలుసుకొనే అధికారము వుంది. నిజమైన భర్తలు తమ భార్యలతో ఏరహస్యాన్ని దాచరు పెద్ద పెద్ద సమస్యలతో కూడిన గొడవలని కూడ తమ భార్యతో తప్పకుండా చెబుతారు

హే ఎస్. కుమారీ! దేని వల్లనైతే మా వంటి హిందీ ఆఫీసర్‌ల అస్తిత్వం ఆధారపడి వుందో అసర్వసిద్ధినిచ్చే 'భాషా తత్వానికి' చేతులెత్తి దండం పెడతాను. అతి సరళమైన భారతీయ వాతావరణం గురించి ఇంగ్లీషు భాషలో ఆరి తేరిన వాళ్ళు ఇంగ్లీషులో వ్యక్తం చేస్తారు. ఆ తరువాత మా వంటి హిందీ అధికారులు హిందీలో అనువదిస్తారు. ఈ విధంగా భావం తిన్నగా హిందీలోకి రాకుండా ఇంగ్లీషులోంచి వచ్చి ఒక కొత్తరకమైన అందచందాలని తీర్చిదిద్దు కుంటుంది ఎలాగంటే బీహార్ ప్రథమ ముఖ్యమంత్రి డా. 'శ్రీకృష్ణ సింహ'ని ఇంగ్లీషులో వార్తలు చదివే వారు 'డా. కృష్ణాసింహ' అని చదువుతారు 'డా.' తరువాత 'శ్రీ' అనే అవసరం లేదను కుంటారు కాబోలు, ఎందుకంటే 'డా' అనే సూర్యుని ఎదుట 'శ్రీ' అనే మిణుగురు పురుగు ఎలా నిలవ గలదు? 'కృష్ణని 'కృష్ణా' అన వలసినదే, ఆ తరువాత హిందీ వార్తలు చదివే వాళ్ళు కూడా పెద్దలు చూపిన ఈ మార్గాన్ని అను సరిస్తారు, అంటే—'బీహార్ ప్రథమ ముఖ్యమంత్రి' డా కృష్ణా సింహా' అక్కడ ముఖ్యమంత్రి పేరుని కూడ వార్తలు చదివే వాళ్ళలాగే చదువుతారు. హే దేవి ఒ భాష మరొక దానితో కలిస్తే ఎంత ప్రభావవంతంగా తయారవుతుందో నీకు పై చెప్పిన ఉదాహరణతో అర్ధమై వుంటుంది, భాషలో ఒక అద్భుతమైన చమత్కారం వస్తుంది

హే డార్లింగ్! ఇన్నాళ్ళు నాతో కలిసి వున్నప్పటికీ నీలో యింకా సందేహా లున్నాయంటే తప్పకుండా హిందీ పత్రికల ప్రభావమై వుంటుంది. ఇటువంటి సంశయాలు మూర్ఖులు, చదువుకోని వాళ్ళు రాజకీయ నేతలు ఉపన్యాసాలని వేద వాక్యాలనుకునే వాళ్ళు, విమానాల్లో ఎప్పుడూ ప్రయాణం చెయ్యని వాళ్ళు, ఐదు తారల హోటళ్ళకు వెళ్ళని వాళ్ళు అంటే 'మాడర్నిటీ' అంటే తెలియని వారి మనసుల్లో పుడుతూంటుంది

హే ప్రియా!, ఎవరైతే ధారాప్రవాహంగా ఇంగ్లీషు మాట్లాడలేరో వాళ్ళ భావాల్లో కూడ మార్పుండదు. అటువంటి వాళ్ళకి యిహలోకమే కాదు పరలోకంలో కూడా స్థానం వుండదు. ఇటువంటి వాళ్ళని రెండోరకం పౌరులంటారు, వీళ్ళు సిగ్గుతో వంగే యుంటారు. అటువంటి సిగ్గువల్ల గొప్పగొప్ప అధికారులు పెద్దపెద్ద రాజకీయనాయకుల ఎదుట నోరు విప్పలేరు. ఇవన్నీ మన భారతీయ సాహిత్య ఎకాడమీ'లో కూడ నీకు ఇంగ్లీషులో మాట్లాడటం రాకపోతే సిగ్గుతో తల వంచుకోవలసి వస్తుంది. ఎవరైతే ఇంగ్లీషు చదవకుండా ఎమ్.ఎ.డిగ్రీ పుచ్చుకుంటారో వాళ్ళకెక్కడా విలువవుండదు, వాళ్ళని చదువుకున్న మూర్ఖులనుకోవచ్చు.

హే ఎన్. కుమారీ! ఈ విషయముగురించే విశ్వహిందీ పరిషత్ అధ్యక్షులు డా॥ కె. సింహాతో కూడ చర్చ జరిగింది. అతడు జిజ్ఞాసులకి యీ విధముగా సమాధానమిచ్చేరు—ఎలాగైతే సగుణభక్తి నిర్గుణ భక్తిలో ఎటువంటి తేడా లేదో అలాగే ఇంగ్లీషు హిందీలో కూడ లేదు. ఏ భాషైనా చెడ్డది కాదు. అన్ని భాషలూ సరస్వతీదేవి రూపాలు. అందువల్ల వీటిల్లో భేదం చూపటం వ్యర్థం. హే ప్రియా! డా॥ కె సింహా ఇంగ్లీషులోనే పుస్తకాలు వ్రాస్తారు.

అతని శిష్య బృందం వాటిని హిందీలో అనువదిస్తారు.

హే ఎస్. కుమారీ! సామాన్య ప్రజలు సగుణ భక్తిని అనుసరిస్తే, ప్రబుద్ధులు నిర్గుణాన్ని అనుసరిస్తారు. చదువుకున్నవాళ్ళు సంపన్నులకి ఇంగ్లీషే సరైన వాడుక భాష, హే ప్రియా, గాంధీగారి నాటి సత్య యుగం గురించి నాకేమీ చెప్పకు. మనమిప్పుడు 21వ శతాబ్దంలో కొచ్చేశాము. ఈ శతాబ్దంలో హిందీలో మాట్లాడటం 'అవుటెడేటెడ్' అనిపిస్తుంది. ఒకవేళ గ్రామీణులతో మాట్లాడవలసివస్తే హిందీలో మాట్లాడి పని జరుపుకోవచ్చు. గాని చదువుకున్న వాళ్ళవద్ద ఇంగ్లీష్ మన గౌరవాన్ని పెంచుతుంది.

ఎస్. శంకర్ వివరించ సాగేడు. 'మనపూర్వ జన్మ పాపాల వల్ల మనం భారతదేశంలో హిందీ మాట్లాడే అమ్మకడుపున పుట్టేము. నీవు యీజన్మలో కూడ హిందీలోనే మునిగి తేలాలనుకుంటే ఎన్ని జన్మలెత్తినా ముక్తి దొరకదు. ఇప్పటికైనా నీ పిల్లాడి భవిష్యత్తు-నీ భవిష్యత్తులను దిద్దుకోవాలనుకుంటే హిందీని గొప్పగా భావించే యీ భావాన్ని నీ మనస్సులోంచి తుడిచిపారవేయి. దీనికి తిలోదకాలిచ్చేసెయ్. నాకు తెలుసు డార్లింగ్! దీనివల్ల నీకు కష్టం కలగవచ్చు. ఎందుకంటే నీవు హిందీలో ఎమ్.ఏ. చేశావు. కాని, మరొక మంచి మార్గం కూడ లేదు. మంచిజరగాలంటే యీ హిందీపట్ల వుండే మమకారాన్ని వదులుకోవాలి. సరే, ఇందులో నువ్వెంతమాత్రం సందేహించవద్దు మరి బచ్చన్‌గారిలా మనవడిని స్విట్జర్లాండ్‌లో ఇక్కడే ఇంగ్లీషు మీడియమ్ స్కూలులో చదివిస్తున్నారు. మనకి కూడ అన్నీ కలిసివస్తే విదేశాలకు వెళదాము. కాని, అందుకు మొదటి నుండే సిద్ధంగా వుండాలిగా.

హే. ఎస్ కుమారి! ఇంగ్లీషు ప్రభావం సంస్కృత మంత్రాలలో కూడ కనిపిస్తుంది. నిజంగా చెప్పాలంటే పదాలనే 'అక్షర బ్రహ్మం' అనుకోవాలి. దీన్లో చాల శక్తివుంది. ఎవరినైనా ఎంతైనా బాధపెట్టవచ్చు, అవమానం చెయ్యవచ్చును, కాని, ఆఖరున రెండు అక్షరాల మంత్రం 'సారీ' అంటే చాలు. అమనిషి పడగ విప్పిన కోపం శాంతిస్తుంది. అలాగే ఎవరినైనా 'ఎక్స్‌క్యూజ్ మీ' అనే మంత్రం చదివేస్తే ఎవ్వరు నిన్ను రవ్వంతైనా మాట అనరు. నీ కోసం ఎవరైనా తన ప్రాణాంనిచ్చినప్పుడు ఆమనిషి ఋణం 'థేంక్యూ' అని వెంటనే తీర్చెయ్యవచ్చు. హే ఎస్ కుమారీ! ఇటువంటివి ఎన్నో బ్రహ్మాండమైన మంత్రాలున్నాయి. ఒప్పుడు భక్తిప్రభావం వల్ల 'రామ' మంత్రం అతి సులభంగా, సహజంగా అందరికీ అందుబాటులో వుండేది. ఆధ్యాత్మిక జ్ఞానం లేని వాళ్ళు కూడ సునాయాసంగా ఆ మంత్రాన్ని అందుకొనేవారు. అలాగే హె ఎస్. కుమారి! ఇంగ్లీషు భాషలో ప్రవేశం లేనివాళ్ళు కూడ ఈ అమోఘమైన మంత్రాలను కంఠస్థం చేసుకుంటారు. సమయం వచ్చినప్పుడు వాటి నుపయోగించుకుని సార్థకులౌతారు. ఏ భాషలో యిటు వంటి మూడు నాల్గు బ్రహ్మాండమైన పదాలున్నాయో ఆ భాష ఎంత గొప్పదై యుంటుందో నీవు అర్థం చేసుకోగలవు, హే ప్రియా! నీవు ఇంగ్లీషు ధారా ప్రవాహంగా మాట్లాడగలిగితే, మరో భాష రానట్లు గానటించవచ్చు (ఎవ్వరేమనుకోరు) కేవలం సౌంజ్ఞ వల్లనే కన్నులెజ్జ చేసి, వాళ్ళని బొమ్మను గలవు. ఇంగ్లీషు న్యూస్ పేపర్స్ హిందీ వాటి కంటె ఎక్కువ ధరలో అమ్ముడు పోతాయి. ముష్టడిగే వాళ్ళు కూడ ఇంగ్లీషులో అడిగితే బోలెడంత డబ్బు సంపాదించవచ్చు, హిందీలో అడుక్కునే

వాళ్ళ కైదు పది పైసలు దొరికితే ఇంగ్లీషులో అడిగే వాళ్ళకి, పది-పదిహేను రూపాయలు వేయడం నేను స్వయంగా చూసేను.

హే ప్రియే! అటువంటి ఇంగ్లీష్ భాష అతి గొప్పతనాన్ని నీకు క్లుప్తంగా చెబుతున్నాను జాగ్రత్తగా విను—హే ఎస్. కుమారీ! ఇంగ్లీషు మంగళ ప్రదమైనది. అన్ని అమంగళాలనీ హరిస్తుంది. ఎవరికైతే ఇంగ్లీషుపై అధికారం వుందో వాళ్ళ కన్నియున్నట్లు భావించాలి వాళ్ళు ఏదైనా సాధించగలరు. హె ఎస్ కుమారీ! ఇంగ్లీషు కామధేనువులా అన్ని రకాల సుఖాలని యిస్తుంది. ఎవరైతే మంద మతులో మూర్ఖులో వాళ్ళె యిటువంటి కామధేనువుని ఆశ్రయించరు గాయత్రి మంత్రం ఎలాగైతే భూతప్రేతాదులను దగ్గరకు రానివ్వదో అలాగే ఇంగ్లీషు హె ఎస్ కుమారీ! చప్పట్లతో ఎలాగైతే పిచ్చుకలని ఎగరగొట్ట వచ్చునో, లక్ష్మి నాహ్వానించ వచ్చో అలాగే ఇంగ్లీషువల్ల అసభ్యత అనే పిచ్చుకనె ఎగరగొట్ట వచ్చు ఐశ్వర్యమనే లక్ష్మి నాహ్వానించవచ్చు.'

ఇటువంటి పరమ గోపనీయమైన రహస్యాన్ని విని ఎస్. కుమారి; ఎంతో సంతోషంతో అన్నది. హే స్వామి నాసందేహము తొలగిపోయింది. పదండి మనము క్లబ్ కి వెళ్ళొద్దాము, అమెంది.

# పుస్తక సమీక్ష

## శ్రీ మద్భాగవతము

ఇది సరళాంధ్రంలో అనువదింపబడిన వచన రచన. ఇందులో పంచమస్కంధము నుండి నవమస్కంధము వరకు ఐదు స్కంధాలు ఉన్నాయి. తొలుత కథా ముఖమనే శీర్షికతో ప్రథమస్కంధము నుండి నవమస్కంధము వరకు భాగవత కథ సంగ్రహంగా వివరించబడినది. ఇది ఎంతో ప్రయోజనకరమైన అంశమని చెప్పడంలో అతిశయోక్తిలేదు. ప్రతిస్కంధాన్ని గూర్చి చెప్పేటప్పుడు అందులోని అంశాలేకాక మధ్య మధ్య మూలశ్లోకాలు, అక్కడక్కడ పోతన పద్యాలు ఉదహరించడం జరిగింది.

పంచమస్కంధంలో సంసారాసక్తులకు భగవత్ప్రాప్తి, ప్రియవ్రతుని సంతానం ఋషభావతారం, భరతచరిత్ర, భరత వంశాన్ననుక్రమం, భారత వర్ష విశేషాలు మొదలైనవిషయాలు ఉన్నాయి.

షష్ఠస్కంధంలో అజామిళోపాఖ్యాన, మన్వంతర సృష్టి, వృత్రాసురవృత్తాంతం చిత్రకేతూపాఖ్యానం ఇత్యాది విషయాలు పేర్కొనబడినాయి.

సప్తమ స్కంధంలో ప్రహ్లాద చరిత్ర, త్రిపురాసురచరిత్ర, ఆశ్రమ ధర్మాలు, హింసాతత్త్వం—అధర్మ విచారం మొదలైన అంశాలు వివరించబడినాయి.

అష్టమస్కంధంలో మనువుల వృత్తాంతం, కూర్మావతార చరిత్ర, క్షీరసాగర మథనం, గజేంద్రమోక్షం, వామన చరిత్ర మున్నగు విషయాలు ఉన్నాయి.

---

రచయిత — ఏల్చూరి మురళీధరరావు
వెల — రూ. 60-00
ప్రతులకు — శ్రీరామకృష్ణమఠము
మైలాపూరు ; మద్రాసు–600 004.

---

నవమ స్కంధంలో పురూరవ వృత్తాంతం, నాభాగు చరిత్ర, అంబరీష చరిత్ర, పరశురామావతారం, శ్రీరామ చరిత్ర మొదలైన అంశాలున్నాయి.

చివరలో దశమ స్కంధంలోని కొన్ని ముఖ్యాంశాలు తెలుపబడినాయి.

అనువాద భాష సరళమై సామాన్యులకు కూడా అర్థమయ్యే విధంగా ఉండినది. వేదాంతాది విషయాలు కూడా స్పష్టంగా తెలిసేటట్లు తెలుపబడినాయి. ఇందుకు ఒక ఉదాహరణ:—

జన్మ ఉత్పత్తిలయాలు దేనికి? ఇవి దేహాలకే గాని తద్దేహాంతర్గతునికి కలుగవు. కారణమేమంటావా? అతడు నిత్యుడు కాబట్టి అతనికి చావు పుట్టుకలు కలుగవు, అతడు పూర్ణ సన్మాత్ర

వస్తువు. కాబట్టి దీనికి జాతి విభాగంగాని, వ్యక్తి విభాగంగాని కలుగదు.'

ముద్రణ చక్కగా ఉన్నది. ముద్రణ స్ఖాలిత్యాలు లేకపోవడం ప్రశంసనీయం.

ఇలాంటి ఉత్తమ గ్రంథాన్ని ప్రచురించిన రామకృష్ణ మఠం వారు మిక్కిలి అభినందనీయులు.

వేముగంటి

## ఈశ్వర శతకము

ఈ శతక రచయిత వేంకటరాజంగారు అనవద్య హృద్య పద్య రచయితగా, అష్టావధానిగా పేరు గడించి 'కవి శిరోమణి' 'అవధానకేసరి' బిరుదులందినవారు

పద్య రచనలో అందెవారిది అందె వేసిన చేయి. ఇది వరకే కొన్ని పద్య కృతులు సంతరించి ప్రసిద్ధిగాంచారు. పద్య రచనలే కాక గద్య, గేయ రచనలు చేశారు ప్రస్తుత కృతి 'ఈశ్వరా' అనే మకుటంతో వ్రాయబడిన శతకం. దీనిలో భక్తి జ్ఞాన వైరాగ్యాలనూ, సమకాలీన సమాజంలోని అవకతవకలనూ అనాచారాలనూ వివరిస్తూ భగవంతునికి ప్రార్థనా పూర్వకంగా నివేదిస్తున్నారు. కవి అన్ని మతాల సంప్రదాయాలకు అంగీకారయోగ్యుడైన నామ రూపాతీతుడైన పరమేశ్వరుని గూర్చి చెప్పబడిన శతకమిది. వసురాయ కవి రచిత 'భక్త చింతామణి' శతకం లాంటిది ఇది.

వేంకటరాజం గారు పద్య రచనలో చేయి తిరిగిన వారు కనుక శతకంలోని పద్యాలన్నీ హృద్యంగా ఉండి భక్తి జ్ఞాన వైరాగ్య విషయాలను చక్కగా ప్రకటిస్తున్నాయి. మచ్చుకు ఒకటి రెండు పద్యాలు ఉదహరించబడుతున్నాయి.

కవి ఈశ్వరుని తన యోగ క్షేమాలను వహించి, రక్షించుమని ఈ విధంగా ప్రార్థిస్తున్నారు.

'యోగ జ్ఞాన వ్రతాది కర్మతతి నే
నోర్వంగ లేనెంతయున్
రాగ ద్వేషములంటి పీడవు మదిన్
గ్రందయ్యె సంతాపముల్
బాగోగుల్ సరిగా నెఱుంగను భవ
త్పాదాబ్జముల్ నమ్మితిన్
యోగ క్షేమములన్ వహించి దయతో
నోముంగదే ఈశ్వరా'

నేటి దంభభక్తిని ఈలా ప్రకటిస్తున్నారు.

రచన—డా. అందె వేంకటరాజము.
వెల రూ. 10-00
ప్రతులకు—డా. అందె వేంకటరాజము
మహేశ్వరీ గ్రంథ మండలి
2-3-18, మార్కండేయమందిరం వద్ద
కోరుట్ల-505 326, జి॥ కరీంనగర్

'మైకుల్ వచ్చెను భక్తియున్ భజనలున్
బాజారు పాలయ్యె పూ
జాకార్యంబులు నటప్రదర్శనముగా
సాగెన్ త్వదారాధనో
ద్రేకం బెంతయు యాంత్రికంబగుచు
వర్తిల్లెన్ భవన్మందిరా
నీకంబుల్ కుజనాళ్యధీనములు
బందెన్ ప్రముందెదో ఈశ్వరా॥

ఈ విధంగా చూపుతూ పోతే ఎన్ని పద్యాలైనా ఉదహరించవచ్చు. శతకాన్ని పఠించి అందులోని అంశాలను ఆకళింపు చేసుకొని ఆనందించాలని కోరుతూ, ఇంతటి మేలైన రచన చేసిన వేంకట రాజంగారిని అభినందిస్తున్నాను.

వేముగంటి

## నువ్వూ-నేను జాబిల్లి

ఇది చిన్న నవలికి రచయిత తొలిప్రయత్నం. ఇందులోని కథ ప్రధానంగా నాలుగు పాత్రల మధ్య నడుస్తుంది. రచయిత ఒక ఉదేశ్యంతోను, చైతన్యంతోను రచన చేయడం ప్రారంభించినప్పటికిని ఆయన తను చెప్పదలచుకున్న అంశాన్ని సరిగా వ్యక్తీకరించలేక పోయారేమో ననిపిస్తుంది. తను చెప్పదలచుకున్న ఆదర్శం చివరకు వచ్చే సరికి అంతుచిక్కకుండా పోతుంది.

(నువ్వూ-నేను జాబిల్లి-నవలిక్-Ch వేణు-వర్కింగ్ ఎడిటర్, జలపాతం వారపత్రిక. నిజామాబాదు)

ఏమీ మసాలాలు లేవు. రచనా శైలిలో కంటిన్యుటీ ఉండదనుటకు 39వ పుటలోని ఆరోలైను నుండి గమనించ వచ్చును. ఐశ్వర్య పాత్రపై రాయడం అనే విషయాన్ని ప్రధానంగా చెప్పినప్పటికిని దాని అవసరం నవలలో ఎక్కడా కనపడదు.

రచయితకు కథా సంవిధానంపై పట్టుఉన్నది కాబట్టి పట్టుదలతో సాధిస్తే ఆయన ముందు ముందు మంచి రచయిత కావడానికి అవకాశం ఉన్నది. శ్రీ వేణుగారు వచన రచనలోని మెలుకువలు గ్రహించారు కాబట్టి ఆయనలోని కథకుడు మేల్కొంటాడని ఆశించవచ్చును.

టి. రంగస్వామి
విద్యారణ్యపురి
వరంగల్లు

## కరుణాతరంగిణి

ఈ కరుణాతరంగిణి శ్రీ పెన్మెత్సరాజం రాజు గారు వచనంలో అలరించిన బుద్ధ చరిత్ర. ఇది 1962లో రచించినది. ఇన్ని నాళ్ళకు ముద్రణకు నోచుకొని పాఠకలోకంనికి అందించబడినది. రచయిత దానిని సులభ శైలిలో అందించడానికి ప్రయత్నం గావించినారు. బుద్ధుని చరిత్రను ఒక దర్శనకావ్యంగా దానని మలిచారు. రచయిత ఈ పుస్తకం చదివినపుడు రచయిత తెరవెనుక

(కరుణా తరంగిణి-శ్రీ పెన్మెత్సరాజంరాజు
ప్రతులకు-శ్రీ వాసుదేవాశ్రమం, చోడవరం,
పశ్చిమ గోదావరిజిల్లా 534111
వెల రూ 10-00 పుటలు 68)

ఉండి వ్యాఖ్యానం చేస్తుంటే చిత్రం కదిలిపోతున్నట్లుగా భావన కలుగుతుంది. అక్కడక్కడ ఉరుకులు పరుగులుగా సాగుతుంది. ఉరుకులు పరుగులుగా సాగడం వలన అక్కడక్కడ రచయిత లాంగ్ జంప్ చేసినట్లుగా కనిపిస్తుంది. అక్కడక్కడ రచయిత విషయాన్ని కేవలం స్పర్శా మాత్రంగా చెప్పారు. బుద్ధ దేవుని గురించి తెలుసుకోవడానికి ఈ పుస్తకం ఉపయోగపడుతుంది.

టి. శ్రీరంగస్వామి
విద్యారణ్యపురి
వరంగల్లు

# ఎం 'వాపి 'ని

## మదనపల్లె హిందీ ప్రేమీమండలి స్వర్ణజయంతి ఉత్సవ మహాసభలు

మదనపల్లె హిందీ ప్రేమీమండలి స్వర్ణోత్సవ హిందీ మహాసభ బిసెంటు థియెసాఫికల్ కాలేజి, బిసెంటు హాలులో ది. 7-6-1995 శనివారం ఉదయం 10 గంటలకు మహావైభవంగా జరిగెను. ఈ సభలకు ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి గౌరవనీయులు ఎ. గోపాలరావు గారు, రాజంపేట లోక్‌సభ సభ్యులు ఎ. సాయిప్రతాప్‌గారు, దక్షిణ భారత హిందీ ప్రచార సభ కార్యవర్గ సభ్యులు శ్రీ వేమూరి ఆంజనేయశర్మ గారు శ్రీ అన్నదానం రామస్వామి గారు విచ్చేసిరి.

ఆహ్వానసంఘంవారు వీరికి పూర్ణకుంభంతో వేదమంత్రాలతో స్వాగితము పలికిరి.

ఆహ్వాన సంఘ అధ్యక్షులు ధర్మప్రకాశ్ శ్రీ బింగి శ్రీరామయ్య శ్రేష్ఠిగారు ముఖ్య అతిథులను వేదికపై ఆహ్వానించిరి.

శ్రీ కె సుధాకర్‌గారు స్వర్ణజయంతి కన్వీనర్ డా. ఎం కృష్ణోజీరావుగారు, శ్రీ టి వెంకటాచారిగారు· శ్రీ పి. ఒబయ్యగారు, శ్రీ సి. శ్రీరాములు రెడ్డిగారు వేదికనలంకరించిన పెద్దలను పూలమాలలతో సత్కరించిరి.

ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి ఎ. గోపాలరావుగారు జ్యోతిని వెలిగించి అనిబిసెంటు విగ్రహమును పూలమాలతో అలంకరించిరి

కుమారి వి ఎం. గాయత్రిగారి ప్రార్థనతో సభ ప్రారంభమయ్యెను. ఆహ్వాన సంఘ కన్వీనర్. డా. ఎం. కృష్ణోజీరావుగారు మదనపల్లె హిందీ ప్రేమీ మండలి 50 సంవత్సరముల చరిత్రను గురించి క్లుప్తముగా వివరించిరి 1945 సంవత్సరములో కీర్తి శేషులు శ్రీ టి. కన్నయ్య దంపతులు హిందీ ప్రేమీ మండలిని స్థాపించిరి. హిందీ ప్రచారము చేసిరి. తదుపరి వేమూరి సుబ్బారావు గారు హిందీ ప్రచార కార్యభారమును వహించి ఈ స్వర్ణజయంతి కార్యక్రమము వరకు శిక్షణా విభాగమును, ప్రచార విభాగమును నిర్వహించున్నారు. ఈ ప్రేమీమండలికి కీర్తి శేషులు ఎం. వి. పాపన్న గుప్తగారు అధ్యక్షులుగా ఉండిరి. కీర్తిశేషులు శ్రీ శ్రీ బి ఎన్. నాగిరెడ్డిగారు కీర్తిశేషులు శ్రీ అల్లూరి నరసింహాగార్ల హిందీసేవ మరువరానిది.

ఆహ్వాన సంఘ అధ్యక్షులు ధర్మప్రకాష్ శ్రీ బింగి శ్రీరామయ్య శ్రేష్ఠిగారు హిందీ ప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ కె. సుధాకర్ గారు ముఖ్య అతిథులను దుశ్శాలువలతోను, మెమెంటోలతోను సత్కరించిరి.

అధ్యక్షత వహించిన ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి గౌరవనీయులు ఎ. గోపాలరావు గారు తమ ఉపన్యాసములో విభిన్న భాషా సంస్కృతులు గల ఈ దేశంలో హిందీ అనుసంధాన భాషగా ప్రజలమధ్య ఐక్యతకు దోహదపడుతుందని వివరించిరి. హిందీ కేవలం జాతీయభాషయే కాదు అది మన దేశంలోని వివిధ రాష్ట్రాలకు మధ్య వారధిగా పనిచేస్తుందని నుడివిరి. దేశంలో ఆంగ్లభాష ప్రజలమధ్య అవగాహన కుదుర్చుతున్నప్పటికి అది కొద్దిమందికి మాత్రమే పరిమితమైనదని అన్నారు. గ్రామీణ ప్రాంతాలనుండి పట్టణవాసుల వరకు ప్రతిఒక్కరు తమ భావములను ఇంకొకరికి అర్థం అయ్యేలా వ్యక్తం చేసేందుకు హిందీ భాష చక్కగా దోహదకారిగా ఉన్నదనీ. హిందీ ప్రేమీమండలి ఈ విధంగా స్వర్ణోత్సవ మహాసభ జరుపుకొనుట చాలా ముదావహమనియు దీనివలన ప్రజలలో హిందీ భాషపైన అభిమానం కలుగునని నుడివిరి.

దక్షిణ భారత హిందీ ప్రచారసభ కార్యవర్గ సభ్యులు శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారు ప్రసంగిస్తూ 1918వ సంవత్సరములో దక్షిణభారత హిందీ ప్రచార సభను మద్రాసులో పూజ్య మహాత్మా గాంధీగారు స్థాపించినారని దాని ఉపశాఖయే మదనపల్లె హిందీ ప్రేమీమండలి అని ఆ సభ దక్షిణాది రాష్ట్రాలలో హిందీ భాషాభివృద్ధికి విశేషంగా కృషి చేస్తున్నదని నుడివిరి. ఇప్పుడు ఈ సభ యునివర్శిటి స్థాయికి ఎదిగి ఎం.ఎ., పిహెచ్ డి. డిగ్రీలను ప్రధానం చేయగలుగుచున్నదని చెప్పిరి. ప్రస్తుతం కంప్యూటర్లలో కూడా హిందీభాష ప్రవేశ పెట్టడం జరిగిందని కూడా నుడివిరి. మదనపల్లె హిందీ ప్రేమీమండలివారు ఈ ఉత్సవం జరుపుతున్నందులకు తమ హర్షాన్ని వెలిబుచ్చుతూ భాషావ్యాప్తికి విద్యార్థులు అధ్యాపకులు చేయవలసిన కృషిని, వారి బాధ్యతలను గుర్తుచేసిరి. హిందీభాష జాతిని కలిపేవేగానే ఐక్యతకు భంగం చేసేది కాదని కూడా వారు చెప్పిరి. జాతీయభాష హిందీని పిల్లలకు నేర్పించడం తల్లిదండ్రుల కర్తవ్యమని తద్వారా భావిపౌరులైన విద్యార్థులలో విశాల భావములు పెరిగి భారతదేశ సమైక్యతకు దోహదపడుతుందని ప్రసంగించిరి. విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ గారు జాతీయగీతం 'జనగణమన' వ్రాసిన ఈ ప్రదేశంలో ఈ స్వర్ణోత్సవం జరుపుకొనుట చాలా ఆనందదాయకమనిరి.

దక్షిణ భారత హిందీ ప్రచార సభ కార్యవర్గ సభ్యులు శ్రీ అన్నదానం రామస్వామిగారు ప్రసంగిస్తూ, 1918వ సంవత్సరములో 5మంది విద్యార్థులతో ప్రారంభమైన హిందీ ప్రచార సభ ఈ రోజు 6 లక్షల మంది విద్యార్థులకు ప్రతి సంవత్సరం శిక్షణ ఇస్తుందని నుడివిరి. హిందీ ప్రచార సభ చేపట్టిన ప్రగతి కార్యక్రమాల గూర్చి వివరించిరి, దక్షిణాది భాషల సాహిత్యాన్ని కవితలను హిందీలోనికి తర్జుమా చేసి ఉత్తర భారతదేశంలోని వారికి మన సంస్కృతిలోని ప్రాచీనతను తెలియచేయు కృషి కొనసాగుతున్నదని నుడివిరి. హిందీభాషను గూడా ఆంగ్లభాష మాదిరిగా శీఘ్రగతితో జనజీవనంలో ప్రవేశించుటకు అనుకూలంగా ఆధునిక పద్ధతులలో బోధించవలెనని నుడివిరి. హిందీ భాష నేర్చుకొనుట వలన విద్యార్థులలో దేశ ప్రేమ సౌశీల్యం, సౌజన్యం, పెరుగుతుందని నుడివిరి. హిందీ ప్రేమీమండలి స్వర్ణజయంతిని జరుపుకొనుట తనకు చాలా సంతోషము కలిగించిందని చెప్పిరి. మదనపల్లె హిందీ ప్రేమీ మండలి ప్రత్యేకత ఏమనగా యీ ప్రేమీ మండలి అధ్యక్షులుగా వుండిన కీర్తిశేషులు ఎం.వి. పాపన్నగుప్తగారు దక్షిణ

భారత హిందీ ప్రచార సభ ఆంధ్రశాఖకు 15 సంవత్సరములు అధ్యక్షులుగా వుండిరి. శ్రీ వేమూరి సుబ్బారావుగారు 5 సంవత్సరములు అధ్యక్షులుగా వుండిరి ఆంధ్రప్రదేశ్‌లో ఈవిధంగా స్వర్ణజయంతి జరుపుకొను మదనపల్లె హిందీ ప్రేమీమండలికి కలిగిందని చెప్పిరి.

రాజంపేట లోకసభ సభ్యులు శ్రీ ఎ. సాయి ప్రతాప్‌గారు ప్రసంగిస్తూ సమైక్యత కోసరం జరిగిన ఉద్యమాలలో భాషా ఉద్యమానికి విశిష్ట స్థానం ఉందన్నారు. విభిన్న భాషా ప్రాతిపదిక రాష్ట్రాలుగల మన దేశంలో ప్రాంతీయ అసమానతలను పోగొట్టి జాతీయ సమైక్యతను తీసుకొని రావడానికి హిందీ భాషను ప్రోత్సహించాల్సిన అవసరం ఎంతైనా ఉందన్నారు. నా నియోజక వర్గంలో ఉన్న మదనపల్లె హిందీ ప్రేమీమండలి స్వర్ణోత్సవం జరిపి హిందీ భాషా ప్రచారానికి దోహదపడుట తనకు గర్వకారణం అని చెప్పిరి. భవిష్యత్తులో ఈ హిందీ ప్రేమీమండలికి ఏ సహాయం కావాలన్నా చేస్తానని వాగ్దానం చేసిరి.

ఆహ్వాన సంఘ ఉపాధ్యక్షులు శ్రీ ఆర్. పార్థసారథిగారు హిందీ ప్రేమీ మండలి కార్యకలాపాలను గురించి వివరించిరి. ఈ సందర్భంగా ఈ ప్రేమీమండలి ఈ ఉత్సవాలు జరుపుటలో కృషి చేసిన ప్రేమీ మండలి అధ్యక్షులు శ్రీ కె. సుధాకర్‌గారిని, వేమూరి సుబ్బారావుగారిని పూల మాలలతో సత్కరించిరి.

పట్టణ ప్రముఖులు, ఆహ్వానసంఘ అధ్యక్షులు శ్రీ బింగి శ్రీ రామయ్యగారు ఉపాధ్యక్షులు, శ్రీ జె రమేష్‌గారు, డా. ఎం. కృష్ణోజీరావుగారు, శ్రీ పి. ఓబయ్య ప్రిన్సిపాల్ వి. పి రెసిడెన్షియల్ స్కూలు కొండిగినహళ్లిగారు శ్రీ రవీంద్రవర్మగారు శ్రీ పి. త్యాగమూర్తిశర్మగారు హిందీ ప్రేమీ మండలి కార్యకలాపాలను గూర్చి దేశానికి హిందీ అవసరమని ప్రసంగించిరి.

హిందీ ప్రేమీ మండలి స్వర్ణోత్సవాల్లో భాగంగా హిందీ పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ప్రమాణ పత్రాలు శ్రీ అన్నదానం రామస్వామి గారు అందించేసిరి.

తదుపరి హిందీ పండితులను శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారు దుశ్శాలువలతో సన్మానించిరి.

పట్టణ ప్రముఖులు శ్రీ సుబ్రహ్మణ్యంగారిని, శ్రీ బింగి శ్రీ రామయ్యశ్రేష్ఠిని, శ్రీ జె రమేష్ గారిని, శ్రీ ఆర్. పార్థసారథిగారిని ఆహ్వాన సంఘ సభ్యులను దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్రశాఖ కార్యవర్గ సభ్యులు శ్రీ బి. పి. చంద్రగుప్త, శ్రీ ఎల్. బుచ్చినాయుడుగార్లను పట్టణ ప్రముఖులను జిల్లాలో నలుమూలలనుంచి వచ్చిన హిందీ పండితులను ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి గౌరవనీయులు ఎ. గోపాల రావుగారు దుశ్శాలువలతో మెమెంటోలతో సత్కరించిరి.

గౌరవనీయులు శ్రీ కె. ఆర్. రమేష్‌గారు స్పీకర్ కర్నాటక రాష్ట్ర శాసనసభ హిందీ ప్రేమీ మండలి స్వర్ణోత్సవసభలో పాల్గొనిరి ఆహ్వాన సంఘ ఉపాధ్యక్షులు శ్రీ జె. రమేష్‌గారు అధ్యక్షులు శ్రీ బింగి శ్రీరామయ్య శ్రేష్ఠిగారు దుశ్శాలువలతో మెమెంటోలతో వారిని సత్కరించిరి

శ్రీ వేమూరి సుబ్బారావుగారు వందన సమర్పణ చేసిరి. జాతీయ గీతంతో సమావేశ కార్యక్రమము పరిపూర్తిగాంచెను.

సభకు విచ్చేసిన సుమారు 300 మంది పుర ప్రముఖులకు, శ్రీ అతిథులకు, శ్రీ అల్లూరి సుబ్రహ్మణ్యంగారు, శ్రీ కె. గోపాలరెడ్డిగారు మృష్టాన్నములతో విందు నొసంగిరి.

# మదనపల్లె హిందీ ప్రేమీమండలి
# స్వర్ణజయంతి ఉత్సవ మహాసభలు



స్వర్ణజయంతి మహాసభల సందర్భంగా శ్రీ వేమూరి ఆంజనేయశర్మ గారిని సన్మానిస్తున్న శ్రీ కె. సుధాకర్ గారిని ఈ చిత్రంలో చూడవచ్చు.



స్వర్ణజయంతి మహాసభలలో ప్రసంగిస్తున్న శ్రీ అన్నదానం రామస్వామి గారు, ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి గౌరవనీయులు శ్రీ ఎ. గోపాలరావు గారు, లోక్‌సభ సభ్యులు శ్రీ ఎ సాయిప్రతాప్ గారు, తదితరులను ఈ చిత్రంలో చూడవచ్చును

Edited Printed and Published by A. Sankara Sastry on behalf of the D. B. Hindi Prachar Sabha-Andhra, Khairatabad, Hyderabad–500 004.
and Printed at Dakshin Bharat Press, Khairatabad, Hyderabad–500 004.